# ధన్యజీవులు

[కోటీశ్వరుఁడు కానీ, కూటికి లేనివాఁడే కానీ—మానవుని జీవితము ఒక్కతీరున గడచుట దుస్తరము. మనుగడలో ఆటుపోటులు సంభవించుట ప్రకృతి సహజము. అయితే, కలిమికి పొంగుటయు, లేమికి క్రుంగుటయు జనసామాన్యమున పొడకట్టు లక్షణము. ఈ ద్వంద్వములకు అతీతులై, కష్టసుఖములను సమాన దృక్పథమునతో సమన్వయించుకొనఁగల వ్యక్తులే జ్ఞానులు. మాన్యవర్తనులగు అట్టి [illegible] జ్ఞానుల మహిమాన్విత చరితములను, అనుభవైకవేద్యములగు వారి సూక్తులను మనకు చవిఁజూపుచున్నది ఈ చక్కని కథ.]

---

రాములు మాదిగ కులమునకు చెందిన కర్షక యువకుఁడు. అతని వివాహ మగునంత దనుక తండ్రి జీవించియేయుండెను. నాయన పోవుసరికి అతనికి పిత్రార్జిత మస్తి లేదు. సుమారు ఇరువది మేకలు గల చిన్నమంద, పాఁడిపశువులు రెండు- ఇదియే అతని కుండిన యావదాస్తియును. రాములు దూఁబరదిండి గాక ఉన్న యాస్తి ఊడిపోకుండ సంసారకాలక్షేపము చక్కఁగ జేయుచుండెను. మెలఁకువతో మెలఁగుచుండి నందున, పూర్వులు విడిచిపెట్టి వెళ్ళిన దాని నాఁటి కానాఁడు అభి

---

* టాల్‌స్టాయి మహాశయుఁడు 1885 లో రచియించిన Elias అను కథానిక దీనికి మాతృక.

వృద్ధి కాఁజొచ్చినది. రాములుది పాటుపడి న్యాయ్యముగ ఆర్జించు సుస్వభావము. అంతేకాని అయాచితముగ ధనము వచ్చిపడినదిగదా యని అతఁడు దుష్కృత్యములలోఁ బ్రవేశింప లేదు. ఆతని భార్యకూడ పతి మాటమీఁదనే నడచుచు, అడుగు తప్పక అతని ననుగమించు గుణవంతురాలు. ఉభయులు నుదయముననే అంబలికంటె ముందుగ పనికొనికి పోవుదురు, సాయంకాలము ఎల్లరకును వెనుక నిలు సేరుచుందురు. న్యాయవర్తనులై శ్రమపడుటఁ గని, ఆ దంపతులను పరమేశ్వరుఁడు మెచ్చినాఁడు. ఇందులకు ఫలముగా లక్ష్మి వరించి వారి యింట కాలు పెట్టినది. ఇట్లు రాములు ముప్పదైదేండ్లు కష్టపడి వేలకు అధిపతి యైనాఁడు.

ఇఁక నిప్పుడు—పాఁడిపశువులు మూఁడువందలు! మునుపటి యిరువది మేఁకలును ఇప్పుడు ఇరువదివంద లయినవి! పసులను మేఁకలను మేపుచు ఆ గ్రామపు గొల్లలందఱును తన చేతిక్రింది సేవకులైనారు. ఊరి పడఁతులు పాలు పెరుఁగు వెన్న మొదలగునవి తయారుచేయుటకు నియుక్తలైరి. ఇంతియేల! అతనికి గురుఁడు పదునొకండవ యింట నుండుటచే అతఁడు 'పట్టినదెల్ల పసిఁడి, ముట్టినదెల్ల ముత్యము' నగుచుండెననుట అతిశయోక్తి కాదు. ఇట్టి మహోత్కృష్టదశలో సహజముగ లోకమే అతని పేరు "రామస్వామి" గా మార్చివేసినది. సిరిసంపదలు అభివృద్ధియైన కొలఁదియు గొల్ల రాముని నామధేయముకూడ గౌరవసూచకముగా "రామస్వామినాయఁ" డని పొడిగింపఁబడినది.

"ఆహా! అదృష్టమనిన నిట్టిదికదా!" యనుచు లోకము అతని ననేకభంగుల మెచ్చుకొని, నోటికొలఁది పొగడినది. పలుతావులనుండి పలుకుబడి గలవారు అప్పుతీసికొనుటకై ఇటకు వచ్చుచుండిరి. డబ్బుతోడనే పుట్టినారు అసంఖ్యాకులైన ఆశ్రితులు! కీర్తికాంత ఇతని పేరు మున్నెవ్వరును కని విని యెఱుఁగని దూరప్రదేశములకు గొంపోయి పరిచితవర్గమును పిక్కటిల్లఁ జేయుచుండెను. వా రెల్లరును ఇతని యింట విడిసినప్పుడెల్ల వలదని బెట్టుచేయుచున్నను బలవంతపెట్టి పొట్టలుబుకునట్లు తినుపుట తప్పెడిది గాదు. ఇంటికి కొంతమంది క్రొత్త క్రొత్త యతిథులు వచ్చినను భోజనాదికములు సదా సిద్ధముగ నుండును. పేరొందిన పెద్దమనుష్యుఁడు వచ్చెనేని ఒకటో రెండో కోళ్ళు—అతిథులు అంతకు మించినచో అదనముగ మేఁకలు—విందులకై బలియోగపడుట పరిపాటి.

రామస్వామినాయనికి ఇద్దఱు పుత్రులు ఒకపుత్రియు; ముగ్గురును వివాహితులే. ఈయన 'గాములు'గా నుండిన పూర్వదశలో, తనయులు సొమ్ములను మేఁకలను కాయుచు అలసత మాని తండ్రితోపాటు పాటుపడుచుండిరి. ఇపు డట్టి యవసరములేదు; చేతిలో పుష్కలముగ ధన మున్నందున పుత్రు లిరువురును చెడు సాంగత్యము చేసి దుష్టబుద్ధులుగ మాఱిరి. అందొకఁడు మద్యపానము మరగినాఁడు. జ్యేష్ఠుఁడు ఒక దొమ్మిలో చావుదెబ్బలు తిని మడిసినాఁడు. చిన్నవాఁడు కులముతక్కువ కన్నెను కట్టుకొనె. తండ్రిమాట తిరస్కరించె. పైగా అతనిపై కత్తికట్టి, ఆస్తిలోని తనవంతు తనకు తెమ్మని తెగఁగొట్టి పంచుకొని ఎక్కడికో వెడలిపోయినాఁడు.

ఈ యవస్థ ఇటుండ, దొమ్మరోగము వచ్చి పశువులును మేకలును చాలవఱకు నాశము నందినవి. దెబ్బమీద దెబ్బ యన్నటులు, పంటలు తుడిచిపెట్టుకొనిపోయి ఆ వత్సరమే కాటకము ప్రారంభమయినది. కాకు లనదగిన లోకుల మెప్పు వడయుచుండిన రామస్వామినాయని దివ్యవైభవము శిథిలము గాజొచ్చినది.

స్థితిగతులు క్రుంగుటతోపాటు శరీర పాటవమును సన్నగిలి నది. దెబ్బదేండ్లు ముదుసలిద్రై, దివాలా తీసిన నాయుడు నాటినుండి తిరుగ 'రాములూ' అను అతని చిన్ననాటి పిన్న పేరనే అందఱును పిలుచుచు వచ్చిరి. 'సదుమం(త్రపు పెరి'లో లభించిన సాలువులు, కోకులు, మొదలగున వస్తువులు విక్ర యించి జీవనము నిలుపుకొను గతి పట్టినది. అమ్మివేయగా మిగిలిన యొక్క మేకను గూడ అమ్మివైచి, రాములును భార్యయు పొట్టకూటికై ఒకరి మొగము లొకరు చూచుకొన వలసినవారైరి. ఇట్టు పాపము! వచ్చిన పిత్రార్జిత వైభవములు వచ్చినదారినే వెళ్ళిపోయినవి. చంచలచిత్త యగు లక్ష్మి చెప్ప కుండనే రాములకు చిప్ప చేతికిచ్చి మటుమాయమైనది. మిగిలి యున్నదెల్ల తెక్కల కష్టమే! ఒక్కమాటలో చెప్పవలెనసిన- కట్టుబట్టలును కట్టుకొనిన భార్యయు దక్క, అతని దగ్గఱ మఱే మియు లేదు. పోనీ, వెనుక ఆసరా యేమైన ఉన్నదాయనిన ప్రవేలెడంత నిసుగు నయిన ప్రసాదింపలేదా మాయదేవుడు. లేక లేక మక్కువగా పెంచుకొనిన ఒక్కపిల్లయు జవ్వనము చూడకయె పెద్దలఁ జేరుటచే ఆ వృద్ధదంపతులు దిక్కులేని పక్షులైరి.

రాములింటి పొరుగుననే అబ్దుల్లా యను నొక ముసల్మాను గృహస్థు నివసించుచుండెను. దయా దాక్షిణ్యము లతనికి ఉగ్గుపాలతోఁ బెట్టిన ప్రసాద గుణములు. త న్నర్థించువారిని నోటితో లేదనకుండ చేతితో లేదని చెప్పి పనుపఁగలిగిన సామాన్య స్థితిమంతుఁడు. ఉన్నమట్టునకు అప్పులేని నికరమైన ఆస్తి. నలుగురలోను 'ఆహా' యని అనిపించుకొన్న సఫలీకృత జన్మము! గుణరాశి యగు నితఁడు బ్రతికిచెడిన రాములను ఉపేక్షించునని మన మనుకొను టెట్టులు! ఉచ్చదశలో నున్నప్పటి రాముల అతిథిపూజానిరతి మఱపరానిదై యుండి 'ఎంతలో నెట్లు మాఱినదో' యని రాముల దుస్థితికి వగచి, అబ్దుల్లా ఒకనాఁ డతని నిట్లోదార్చెను :

"రాములూ! కాలగతి వేరికిని యొక్క తీరున సాగుట దుర్ఘటముకదా! గతమునకు వగచి లాభ మేమి? ముందుకథ చూచుకొనుట కర్తవ్యము, వివేకలక్షణము. ఇటు చూడుము- నీవు నీ భార్యతోఁగూడ వచ్చి నా యొద్ద నుండుము. పాలికాఁపులు సరిగ పనిచేయునట్లు చూచుచుండుము. ఖులాసాగా నున్నపుడు నీవే పాలు తీయుము. ఇతర సమయములందు దగ్గఱ నుండి పిదికింపుము. ఇఁక నీ భార్య చిన్నచిన్న పనులు చక్కఁబెట్టుచు ఇంటిలో ఆసరాగా నుండఁగలదు. "అల్లా" ప్రసాదించినంతమట్టునకు మాతోపాటు మీరును కలియో గంజియో త్రావి జీవితశేషము వెళ్ళఁబుచ్చుకొనవచ్చును. దైవముఖము చూచి పిలుచునంతవఱకు మీ కే లోటును లేకుండఁ జూచెదను."

ఈ యభయమునకు రాములు వందనపూర్వకముగ

'పల్లె' యని సతీసమేతముగ క్రొత్తకొలువులో కుదురుకొనెను. కూడలు పంచుట మఱచి చిరకాలమైనందున రాములకు పని చేయుట మొదట కొంచెము కష్టమనిపించినది. కాని, చేసి యున్న చేయి కనుక క్రమక్రమముగ ఇంటిబాధ్యత యంతయు పూర్తిగ వహించి సహజ నైపుణితో నిర్వహించుచుండెను.

అవధి యెఱుఁగక విశ్వాసముతో పరిశ్రమ చేయుచున్న ఆ వృద్ధ దంపతుల విలువ అబ్దుల్లాకు విశదమైనది. ఒక పని చెప్పించుకొనుటగాని ఒక మాట అనిపించుకొనుటగాని యెన్నఁడును లేదు. ఏ క్షణమున వారి యింటఁ గాలు పెట్టిరో అప్పటి నుండియు నది స్వగృహమువలెనే చూచుకొనుచు, నిమిషమైనను వ్యర్థపఱుపక వేయికన్నులతో కనిపెట్టుకొనియుండిరి. ఇట్టి న్యాయశీలురఁ జూచి అబ్దుల్లా 'అహా దైవమా! ఎట్టి సజ్జనుల కెట్టి గతి పట్టినది!' అనుకొనుచు జాలిపడి వారినిగుఱించి తఱచు ఖేద మందుచుండెడివాఁడు.

ఒకదినమున అబ్దుల్లా గృహమునకు దూరప్రదేశము నుండి కొంద ఱతిథులు వచ్చిరి. అందు ఒకాయన 'ముల్లా' అనఁగా మతగురువు. నాఁడు ప్రశస్తమైన మేకమాంసము వండింపుమని రాములకు అబ్దుల్లా ఆజ్ఞ యిచ్చియుండెను. రాములు అతి శ్రద్ధతో వంటకముల తయారుచేయించి సిద్ధపఱచినాఁడు. అబ్దుల్లాతోకూడ వచ్చిన అతిథివర్గము మెత్తని పరుపులపైనను తివాసులపైనను ఆసీనులై విందారగించిరి. వారు చిట్టచివర తేనీటిని గ్రోలు సమయమున రాములు వారికి 'తమాకు' సిద్ధము చేయుటకని ప్రక్కద్వారమునుండి పోబోవుచుండెను.

అబ్దుల్లా అతనిని వ్రేలిడి చూపి, ముల్లాతో:—ఆ వెళ్ళు చున్న వృద్ధుని చూచితిరా?

ముల్లా:—అవును, ఏమి?

అబ్దుల్లా:—ఒకప్పు డితఁడు మా ప్రాంతమున తులలేని వైభవముతో తులతూగినవాఁడు. ఈతఁడే రామస్వామి నాయుఁడు. బహుశః ఈ పేరు తమరు వినియే యుందురు.

ముల్లా:—ఓహో, ఔనౌను. ఈయనను గుఱించి చెప్పుకొనుటయే కాని యింతవఱకు చూచియుండలేదు.

అబ్దుల్లా:—పాపము! ఇప్పుడు ఎట్టి యోగాని చేత లేని ఆపన్నుఁడై నాఁడు. నాయొద్దనే పెద్దపాలికాఁపుగా పని చేయుచున్నాఁడు. ఇతని భార్యకూడ ఇటనే పనిచేయును.

విస్మయముతో ముల్లా నాలుక కఱచుకొని తల పంకించి నాఁడు, 'ఆహా కాలచక్రము! ఓడలు బండ్లు, బండ్లు ఓడలు యగునను లోకోక్తి ఇట ప్రత్యక్షానుభూతమయినదే! ఫకీరును బాదుషాగాను, బాదుషాను ఫకీరుగాను చిటికలో చేయఁగలఁడు కాలపురుషుఁడు. ఈ దైన్యావస్థకు ఆ ముసలియతఁ డెంతగా క్రుంగిపోయి కుందుచున్నాఁడో!' అని సానుభూతి కనఁబఱచెను.

అబ్దుల్లా:—ఏ నిముషమున కెవని కేపాటు వచ్చునో ఎవరి కెఱుక? ఈ వార్ధకములోఁగూడ నతఁడు చిద్విలాస ముగనేయుండునుగాని చిఱచిఱలాడి యెఱుఁగఁడు. ఆతనిలో సంతత క్షమాసంపత్తియే గోచరించును కాని, ఎన్నఁడును కొఱకొఱలాడుట కానము. అవధి యెఱుఁగని పరిశ్రమ తప్ప అలసత యనున దాతని జన్మములోనే లేదు.

ముల్లా:—ఒకపరి అతనితో ప్రసంగింపవలెనని యున్నది.

అబ్దుల్లా:—అగత్యా, అభ్యంతర మేమి?— (చప్పట చఱచి)—'రాములూ! కొంచెము తేనీరు తీసుకొందువు గాని ఇటు రమ్ము, అవ్వనుకూడ రమ్మను' మని చెప్పెను.

రాములు వచ్చి, యజమానునికి సలాముపెట్టి ఒకచో ఆసీనుఁడైనాడు. అతని పెండ్లము యజమానురాలితో కూడ తెరచాటున నుండెను. రాములు తేనీరు గ్రోలిన పిమ్మట—

ముల్లా:—తాతా! మిమ్ములఁ జూచినపుడు నీ పూర్వపు వైభవము స్మృతికి వచ్చి వ్యసనపడుచుందువు కాఁబోలు. పాపము! అపుడు లక్షల కధికారివి, ఇపుడు...

(మందహాసముతో) రాములు:—ఇప్పటి నా సుఖదుఃఖములఁ గూర్చి నేనే చెప్పుకొనుట సమంజసము కాదు. అదిగో, అక్కడనున్న మా యింటిదాని నడుగుఁడు. ఆఁడుది— సహజముగ 'నోటిలో నువ్వుగింజ దాఁగదు,' అందుచే ఉన్నదెల్ల సుస్పష్టముగఁ జెప్పును.

(తెరవైపు తిరిగి) ముల్లా:—అవ్వా! మీ బాగోగు లేవో నాకు తెలియఁజెప్పుము. వినుట కెంతయు నుత్తలపడుచున్నాము.

అందులకు ముసలిది తెరచాటునుండి యిట్లు పల్కెను: 'అయ్యా! నేనును నా భర్తయు—ఒకటి కాదు, రెండు కాదు—ఏఁబది వర్షములనుండి సౌఖ్యాన్వేషణమున వ్యగ్రహృదయులమై వ్యవహరించితిమి. కాని ఎందును అది కాన

మైతిమి. ఎవరికొరకు మే మిన్నినాళ్ళు పరితపించితిమో ఆ 'సౌఖ్యదేవత'—కాయకష్టముచే కాలము గడుపుచున్న యిప్పటి మా స్థితిలో ప్రసన్నయైనది. ఇంతకంటె మాకు వలయున దేమి!'

ఇది విని అతిథు లాశ్చర్యభరితులయిరి.

అవ్వ:—'నేను చెప్పిన దంతయు స్వానుభవమే. పరిహాసముకాదు, సత్యమేను. ఏఁబది దీర్ఘవత్సరములు ధనముకొఱకు ఒక్కలాగున ప్రాఁకులాడితిమి. కాని, నాల్గురాళ్ళు చేతనాడుచున్నంతకాలము, సౌఖ్యదేవత మాకు సందర్శనమిచ్చినదికాదు. క్షణభంగురమగు హిరణ్యము హరించుటతోడనే రాజమార్గ మవలంబించి సేవాదీక్షకుఁ బూని, రారాజులకుఁ గూడ దుర్లభమగు ఆనంద సామ్రాజ్యము ననుభవింపఁగల అదృష్టవంతుల మైతిమి.

అబ్దుల్లా:—అయినచో అవ్వా! నిజమగు సౌఖ్యము ఎటనున్నదందువు?

అవ్వ:—మనవి చేసెద, నాలింపుఁడు: సంపద సమృద్ధముగ నుండిన 'అప్పుడు' క్షణమయిన మాకు మనశ్శాంతి లేదు. ఉభయులము తిన్నగా మాటాడుకొనుటకైన, ఆత్మవిచారణమునకైన, దైవచింతనమునకైన అవకాశము లేకపోయెను. అబ్బ! ఎంత వ్యాకులత, ఎంత మనస్తాపము! అది యుటుంచి—మేఁకలను ఏ వఱడయిన ఏ తోఁడేలయిన నోట కఱచుకొనిపోవునేమో యను భయము ఒక వంక, పశువులను దొంగలు తోలుకొనిపోదురేమో యను భీతి యొకమూల, రాత్రిపూఁట కంటిమీఁద కునుకు లేక తోఁటలవెంబడిని దొడ్డచుట్టును

గ స్తు పొందుచుంటిమి. అన్నియు అమరిన వనుకొన్నంతలో ఎండాకాలమునకు తినంత పశుగ్రాసము లేకపోయెనని పాలికాపు వచ్చి చెప్పెను. ఈయన్నిటికేమి, ముఖ్యముగ నూదాపటెద్దులో నొకటి మాటపొందిక కుదురకుండెడిది. ఒకపని ఆయన చేయుమని చెప్పును, అది పనికిరాదని నే నెదురాడి పోట్లాడుచుంటిమి. వ్యాధిమున తాప్రతయములలో బడగులొక్కటై పాపములు సంపాదించుకొనుచు, నిర్వ్యాసంగము నకు జీవితములు వ్యర్థముగ గడపితిమి.

ఉబ్బుల్లా:—మరి యిప్పుడో ?

అవ్వ:—ఇప్పుడా! ఉదయముననె లేచి యుభయులము ప్రశాంతముగా ప్రేమపూర్వకముగా ప్రసంగించుకొందుము. చిన్నపిల్ల లొక్క యజమానుని సేవాచింతనము తక్క మరి యితర విచారము లెవ్వియు లేవు. ఆలు మగలలో అభిప్రాయభేదములు కల్పించు అనవసరపు గొడవ లిపు డేమియు లేవు. యథాశక్తి యజమానుని సేవ చేసికొని, మావలన ఆయనకొంత హాని కలసివచ్చునట్లు గష్టపడుటయే మా నిరంతరోద్యమము. నా భర్త పొలముపని చూచుకొని వచ్చుసరికి భోజనము సిద్ధముగ నుంచెదను. చలికాలములో కప్పుకొనుటకు యజమానులు దయతో ననుగ్రహించిన దుస్తులు దుప్పటములు నున్నవి. పొట్టకు బట్టకు లోపము లేనప్పు డింక మానవునకు గొడవ లేముండును ? దైవస్మరణకు ఆముష్మికచింతకు ఎంతో వ్యవధి కలుగుచున్నది. ఏబదేండ్లు ఎడతెగక సౌఖ్యమన్వేషించి, తుదకు ఇప్పుడీ చరమదశలో దానిఁ గనుగొనఁ గల్గితిమి !

ఈ మాటలకు కొందఱు పకపక నవ్విరి.

(వారి నుద్దేశించి) రాములు:—నాయనలారా! నవ్వెద రేల? ఇదంతయు వేళాకోళముగ నెంచుచుంటిరి కాఁబోలు. మొదటిలో మేము కూడ ఐశ్వర్యము పోయినందుకు అనేక విధముల క్షోభించితిమి. కాని యిపుడు అమూల్యానుభవము వలన భగవదుద్దేశము గ్రహించితిమి. మీ శ్రేయస్సు కోరియె మేము చెప్పినది.

అటుపై ముల్లా ఇట్లు నుడివెను:—అవ్వ పలుకులు అమృతప్రాయములు, రాములు వాక్రుచ్చిన దెంతయు తథ్యము. నిరాడంబర జీవనములోనే నిజమయిన ఆనంద మున్నదనుటకు వీరి మనుగడయె మనకు ప్రత్యక్ష నిదర్శనము. పాటుపడువారికి పరమేశ్వర కృప లభించితీఱునని మనకిట యనుభవగోచర మగుచున్నది. ఈ దివ్యసందేశముల నిపుడు స్వానుభవముచే స్మృతిపథమున కెక్కించిన ఈ పుణ్యదంపతులకు మనము సదా కృతజ్ఞులమై యుండవలె. వారి మూలమున ప్రబోధింపఁబడిన మహత్తర సూత్రముల నాచరణమునకుఁ దేఁ బ్రయత్నింపవలయు.



# జాగోపటేలు

---

[పూర్వకాలపు ప్రభువుల తీరుతే వేరు. వారి ఉదారకృత్యములు చిత్రాతి చిత్రములు. ఒక్కొక్క సంఘటన తలంచుకొనిన మెుడలు పులకరించును. అవి నేటికిని రేపటికే కాదు, కలకాలము నిలిచి పోయి స్మరింపతగ్గదిగానుండును. ఈ పలుకులను అక్షరశః సార్థకపఱచు నొక అద్భుత కథనమును చిత్రించుచున్నది ఈ గుజరాతీ జాతీయగాథ.]

---

దీపావళి ఎల్లరను ఆనంద పారవశ్యమున ముంచినది. సస్యానుకూలమగు సమయమయిన వర్షములు, కడుపు నిండించు కనుపండువగు పూర్తిపంట లిచ్చినవి. కోఁతల సందడిలో కర్షకులకు కంటిమీఁద కునుకు లేదు. మగువలు తమ మొగలకు మనఃపూర్వకముగ చేయూఁత నిచ్చుచున్నారు. ఎక్కడ చూచినను పంటకుప్పలే! ఇవి చూచుకొని ఉత్సాహపడని వారెవరు? రేలును బవళ్ళును రాపుడుచెందిన రైతుబిడ్డ, చెమటూర్చి పోసినందులకు తగిన ఫలము కనులార కనుఁగొని ఉబ్బి బ్బౌరఁడా! ఒడలినిండ ఆభరణములు, క్రొత్త క్రొత్త వస్త్రములు లభించునుకదా యని రమణీమణుల ఉల్లాసము ఒకవంక! ఇట్లు జాగోపటేలు కుటుంబమంతయు ఆనందాబ్ధిలో మునిఁగి శ్రమ పాటింపక పాటుపడుచుండిరి.

ఆనాఁటి ప్రాతఃకాలమున మనోహరమగు సూర్యోదయ

కుప్పలు నీరెండలో నిగనిగ మెఱయుచు, ఒక విధమైన వింత సౌరభమును వెదజల్లుచుండెను. పటేలు తన పరిస్థితులు నెమరునకుఁ దెచ్చుకొని పర్యాలోచనములోఁ బడెను. ధాన్యపు కుప్పలమీఁదనే తన కన్ను పడినది. కన్ను పడుటయేమి, ఆతని హృదయమున ఆశాపిశాచము ఆవహించుట యేమి? 'అయ్యో! కష్టపడినది మేము! ఱెక్కలు ముక్కలగునటులు కష్టపడినది మేము. ఈ కుప్పలు—ఈ ధాన్యపు కుప్పలన్నియు—ఎండయనక వాన యనక, మధ్యాహ్నమనక మ్రుచ్చుప్రొద్దనక, ఇపు డనక అపుడనక—పసిబిడ్డలును పడుచువాండ్రును చెమటోడ్చి పండించిన పంట! ఇట్టి పంటలోఁ బిసంతయైన, చీపురుముల్లంతయైన శ్రమ యనునది లేకయే, జమీందారు తన భాగము కబళించుకొనిపోవును కద!' అను మనోవేదన కల్గినది. కొంతసేపాఁగి, తన పెద్దకన్నులను ఇంకొకసారి కుప్పలపై నిలిపెను. నిలిపి, చిత్తములోని దుష్టబుద్ధి ప్రోద్బలముచే నంతియు మరల నిట్లు తలఁచెను:—'కుప్పనుండి ఒక్క బండెఁడు పంట లాగివేయఁగలిగితినా......'

౨

రాత్రి రెండు జాములు దాఁటినది, ఊరు మాటుమణిగినది. పటేలు తన సోదరుని ఒక పరిచారకుని వెంటఁగొనివచ్చి, వారి సాయమున బండినిండ పంట యెక్కించెను. భోజనము లభించిన దనఁగనే పొట్ట ఎరవు తెచ్చుకొను ఘుస్మరబ్రాహ్మణుని పగిది, బండికి తగని బరువువేసి పటేలు దట్టించినాఁడు. బండి యింటికి బయలుదేఱినది. నప్రుకరు సాదక్ష్యము వహింప.

పటేలు ముందునను, సోదరుడు అతని వెనుకను నడచిపోవు చుండిరి.

ఊరి పొలిమేర చేరునరికి, ఇరుసు స్థానము తప్పినది, చక్రములు తిరుగక ఆఁగిపోయినవి. పటేలు తన సహచరుల సాహాయ్యమున బండి బాగుచేయుదమని యథాశక్తితో యత్నించినాఁడు; కాని, భారం మతిశయించుటచే సాధ్యము కాక పోయినది. పాపము! పటేలునకు గట్టి చిక్కు తటస్థించినది: ఎవరినైన సాయమునకు పిలిచిన రహస్యము బయల్పడు నేమో! ముందునకుగాని, వెనుకకుగాని అడుగిడుటకు వీలు లేకుండెను. పోనీ, ధాన్యము నచ్చట దిగవిడచిపోవుద మన్న, అదియు నలవికాని పనియే. ఏమిచేయుటకును తోఁచదాయె. కాలయాపన మైనకొలఁదియు, తాను చేసినది తన మనస్సునే కోఁతలు కోయుచుండెను. ఉన్నవాఁడున్నట్టుగనే పట్టుపడి పోవునేమో యను భీతి ఆవహిల్లినది. లోకనిందకు పాల్పడ వలసెఁగదా యని శరీరము కంపించెను. అట్టి విషమావస్థలో పటేలు, దారినిబోవు అపరిచిత వ్యక్తి ఎవరైన యెదురు పడినచో బాగుగా నుండునుగదా యని తలపోయుచుండెను.

గజాభాయి గోహిల్ ఒకసామాన్య జమీందారు. అతఁడు మామూలు చొప్పున లోటా చేతఁబుచ్చుకొని ఆహ్ని కములు తీర్చుకొనుటకై ప్రాతఃకాలముననే బయలుదేరెను. చలి మిక్కుటముగ నుండుటచేత కన్నులు మాత్రము కనఁ బడులాగున ఒడలంతయు కప్పివేసికొనెను. శోకాందోళిత చిత్తుఁడైన పటేలు అతనిని చూచి 'ఈ పథికుఁడు మన గుట్టు తెలియనేరఁడు' అని యూహించెను. జమీందారు చేరువకు

రాగా, బండిని సరిచేయుటకు కొంచెము తోడ్పడుమని పటేలు కోరెను. ముఖముపైని ముసుగుండుటవలన ఆ చీకటిలోను ఆ కంగారులోను పటేలు, జమీందారు నానవాలు పట్టలేక పోయెను. కాని, కుశాగ్రబుద్ధి కలిగిన జమీందారు, తన పటేలును తత్క్షణమే గుర్తించెను. చిరానుభవమువలన, జరుగుచున్న ఈ రహస్యమును వెంటనే గమనించెను. ఇది చూచి జమీందా రిట్లు యోచించెను:-

'సిస్తు తప్పించుకొనుటకై ఈ పటేలు పంట నింటికి చేర్చుకొనుచున్నాఁడు. నన్ను గుఱుతుపట్టినచో నతనికి విషాదావస్థ ప్రాప్తించును. జాగోవంటి మర్యాదస్థుడు అవమానము భరింపఁజాలక ఆత్మహత్యకుఁగూడ వెనుదీయఁడు.'

ఈ యుద్దేశముతో జమీందారు తన్ను తెలిసికొనలేకుండునట్లు తల వంచుకొని తగిన సాయ మొనరించెను. పటేలు అమితోత్సాహముతో బాగుపడిన బండి నింటికి తోలుకొనిపోయెను. జమీందారు కూడ యింటికి మరలుచు, ఇట్లనుకొనెను:—

'పోనీ, ఏమి పోయినది? పాపము, నిద్రాహారములు లేక వారు అనునిత్యమును పాటుపడుచుందురు. కొంచెము తీసికొనిపోయి రేని నేనేల చింతింపవలె ? ఇంతకును వారు నా రైతులు...నా బిడ్డలు!'

౩

ఆఱు నెలలు కడచినవి. ఈ గాథ యించుమించు విస్మృతిలోఁ బడినది. ఇది యిటులుండ—

ఒకనాఁడు గహాభాయిగారి గృహమునకు పెక్కు రతిథులు వచ్చిరి. ఆ సందర్భమున వారి నవుకరు ఒకటి రెండు పఱపులును మంచములు నమగుటకు పటేలు ఇంటికి వెళ్ళెను, అతఁడిచ్చుటకు సమ్మతింపకుండెను. ఇందులకలిగి నౌకరతనిని కూలఁదాడెను. పటేలునకు ఒడలుడికి 'పట్టిదొరల కొలువులో నేనుండజాల' నని నిష్కర్షగ పలికెను. ఈమాటకు మరహంకారుఁడగు నౌకరు మండిపడుచు 'నిన్నెవ రిటుఁ గట్టిపెట్టిరి? మఱొకచోటికి పోలేకపోయితివా'? యనుచు కసరికొట్టెను.

పటేలునకు అగ్గిపైని గుగ్గిలము పడినది. అన్నంతయు అక్షరశః ఆచరించు దృఢనిశ్చయముతో, తాను వదలిపోవుట కతఁడు సన్నద్ధుఁడయ్యెను. యజమానున కీగొడవ యిసుమంతయు తెలియదు. మఱునాఁడు పటేలు సంసారముతోడను సామానుబండ్లతోను, యజమానుని గృహము ముందఱ నుండియే పోసాగెను. సిఖ్ఖుపటులగు పురజను లతనిని పోవల దని పోరినకొలఁదియు, నతఁడు మఱింత భీష్మించుచుండెను. ఈ యుదంత మంతయు యజమానుని చెవిని బడినది. ఆయన స్వయముగ వచ్చి, పటేలును సముదాయింతమను సంకల్పముతో, అంత సాహసమునకు కతంబేమని యడిగెను.

'మేము కష్టించి సంపాదించిన దంతయు తమకే సమర్పించుకొనుచున్నాము. ఈ శీతకాలమునందు సైతము మాకు చినిఁగిన పఱపులును కుక్కిమంచములే గతి. అయినను మీ పరిచారకుఁడు మమ్ము పీడించుట మాన లేదు. మా కది భరింప శక్యము గాకున్నది' అని పటేలు పట్టరాని హృదయవేదన లార్చెను.

యజమానుఁడు ప్రశాంతచిత్తముతో పరిస్థితులెల్ల గ్రహించెను. తులువ యగు తన నవుకరు వాచాదోషమునకు చిక్కి-లి వ్యథ చెంది, వానిని తగురీతి దండించెను.

'అయినదేదో అయినది. గతము మఱచి యింటికి మరలుము' అని పటేలును మందలించెను. కాని ఆ మృదు వచనములు పటేలు సంకల్పమును నివర్తింపఁజాలకపోయె: అతని మనసు మరల్చుట అసాధ్యముగ నగపడినది.

అంతట జమీందారు పటేలు చెవిలో ఈ చిన్నిరహస్య మును చెప్పి తన మందిరమునకు మరలిపోయెను: 'సరి, జాగో! నీ యిష్టప్రకారము వెళ్ళవచ్చును, కాని నిశీథ సమయమున నీకు ధాన్యపుబండి యెత్తుటలో చేయూఁత యొసఁగఁగల భూస్వామిసమాత్రము సంపాదించుకొనుము.'

అది విని, నిర్ఘాంతపోయి పటేలునకు నోట మాటరాక, స్వాంతమున నిట్లు తలఁచెను: 'మొన్నను బండి యెత్తినది కేవలము యజమానుఁడే. తన సొమ్ము దొంగిలుటలో తానే నాకు సాయపడినాఁడు. నా మర్యాద కాపాడుటకై అతఁడు నన్ను క్షమించి యూరకున్నాఁడు. ఎంత దయాళువు! చాటున నైన నన్ను మందలింపఁడాయె. ఎంతటి నవనీత హృదయము! ఆహా! వేయిజన్మము లెత్తినను ఇట్టి సత్ప్రభువు ప్రాపు నాకు లభించునా? ఎట్టి ఉదారహృదయుఁడు!'

పశ్చాత్తాప పూర్వకమగు ఈ తలఁపులతో పటేలు సిగ్గుపడి, యజమానునియెడఁ దన కృతజ్ఞతను వెలిపుచ్చుచు, వెంటనే బండ్లింటికి మరల్చెను.

* * *

జాగోపటేలు సంతతివారు నేటికిని గుజరాత్ దేశమున ‘వేవాక్’ గ్రామమున నున్నారు. ఇది జరిగి ఇప్పటికి సుమారు డెబ్బదియైదు వత్సరములే యైనది. గజాభాయిగారి లెక్కలేని ఉదారకృత్యములలో నిది యొకటి!

# దాస్యవిముక్తి

[ఏదేశమునకైన ఏకాలమందైన 'స్వాతంత్ర్య భాగ్యము' ను మించినది లేదని ఎల్లరును వాకొందురు. వ్యక్తులు పోరాడుటయు, సమరములు సాగించుటయు ఇందుకొఱకే. స్వాతంత్ర్య సంపాదనకొఱకే ఎందఱెందఱో వీరులు ధీరులు త్యాగముసేయుట మనము కనులార గాంచుచున్నాము. యుద్ధకాముకునైన బలి యిచ్చి తన స్విస్ దేశప్రజలకు స్వాతంత్ర్యలక్ష్మిని సమకూర్చ తల పడిన అకుంఠితదీక్షాపరుఁడు, మేటి విలుకాఁడు, మేరు ధైర్యశాలి అగు విల్యంటెల్ వింత యుదంతమును వెల్లడించుచున్న దీ కథ.]

'స్విట్జర్లండు' లోని 'ఆల్ట్‌డార్ఫ్ మార్కెటు స్క్వేరు'ను దాఁటి సుందరవిగ్రహుఁడొకఁడు పోవుచుండెను. అతఁ డొక కొండదార, ఆజానుబాహు; పొడవునకుఁ దగిన చక్కని స్థౌల్యము గలవాఁడు; అందమగు గడ్డమును ఉదయభాస్కరునిఁ బోలు ఎఱ్ఱని ముఖమును గల దర్శనీయుఁడు. సిరులు చిమ్ము చూపులతోఁ జిఱునవ్వులతో నతఁడు మిత్రులఁ బలుకరించుచు ఠీవిగ పెద పెద్ద అంగలు వేయుచు నడచుచుండెను.

అతనిఁ జూచిన యెల్లరును 'అదిగో! బర్గ్‌లెన్ ధానుష్కచక్రవర్తి పోవుచున్నాఁ' డందురు.

స్విట్జర్లండులో నీతఁడు మేటి విలుకాఁడని ప్రసిద్ధి. 'యూరీ' సరస్సులో తుపాను పట్టినపుడు ఈతఁ డొక్కఁడే

కడు సాహసముతో పడవ నడుపఁగలిగెను. ఇతఁడు భార్యా బిడ్డలను పోషించుకొనుచు, కొండలలో నొక కుటీరము వేసికొని వసించుచుండెను.

కొండలపై లేళ్ళను వేటాఁడుటయు, సరస్సులో చేఁపలు పట్టుటయు అతనికి నిత్యకృత్యములు. ఇల్లు పొంకముగను పరిశుభ్రముగను ఉండును. కుటుంబమునకు కూడు గుడ్డల కిసుమంతయు లోపము లేదు. ఇంత శాంతియుతముగను తృప్తిగను కాలక్షేపము చేయుచున్న కుటుంబము ఆ చుట్టుపట్ల నిది యొక్కటియే యని చెప్పవచ్చు.

మన కథానాయకుఁడగు ఈ 'విల్యంటెల్'—మార్కెట్టునకు తెచ్చిన జింకచర్మముల కట్టను అమ్మివైచి, బిడ్డలకు ఉన్నిదుస్తులు కొందమను సంకల్పముతో నిప్పుడు పోవుచున్నాఁడు. చేతిలో పుష్కలముగ సొమ్మున్నందున ఉల్లాస చిత్తుఁడై యుండెను. అడ్డంకు లేమియు రానిచో ఇంచుమించుగ నింకొక్క గంటలో పాటలు పాడుకొనుచు సానందముగ తన శైలకుటీరము చేరియుండును.

ఆకస్మికముగ వెనుకనుండి వచ్చి ఒక ఆస్ట్రియను సిపాయి అతని భుజమును గట్టిగ పట్టుకొనెను. మఱొక్క నిమిషములో పలువురు సిపాయీలు వచ్చి అతనిని చుట్టుముట్టిరి. అక్క పట్టుకొనిన యోధుఁడు—చివరను కిరీటము గల ఒక స్తంభముఁ జూపి:

'ఆ కిరీటమునకు వందనము సేయకుండఁ బోవుచో చావు మూఁడునను సంగతి ఎఱుఁగవా?'

'సైకిల్' రంతయు నిశ్శబ్దమయ్యెను. దుకాణదారు లందఱు వ్యాపారము కట్టిపెట్టి ఇచ్చట మూఁగిరి. ఏలకీ వర్తక ముకంటెను ఎక్కువయగు—ఒక మానవుని స్వేచ్ఛ, దేశ స్వాతంత్ర్యము—ఇప్పు డపాయస్థితిలో నున్నది.

విల్యంటెల్ ముఖము ఎఱ్ఱఁబాఱినది. తీక్ష్ణమగు తన దృష్టిని కీస్తంభముపైనున్న కిరీటమునుండి సిపాయి ముఖము పైకి మరల్చి (మెల్లగా):

'నేనేమియు నక్రమ మొనరింపలేదే?'

సిపాయి:—ప్రభుత్వపు ఘనతను తిరస్కరించితివి.

టెల్ :—(తేరిపాఱి చూచుచు)

'పట్టి కోటునకుఁగాని ఇజారునకుఁగాని లేని పూజ ఈ టోపీకేల?'

ఇంతలో వెనుకనుండి, కొందఱు యోధుల వెంట నిడి కొని క్రూరుఁడగు గవర్నరు—జెస్లర్—వచ్చెను.

ఒకప్పుడు స్వతంత్ర రాజ్యముగ నుండి 'హ్యాబ్‌ఫా స్ట్రి'యాచే జయింపఁబడిన స్విస్ దేశపు స్వేచ్ఛ నణఁగద్రొ క్కిన మహానుభావుఁడీ 'జెస్లరే'. ఆయన కెదురు చెప్పినవారి నెల్ల చంపించెను. 'ఆ స్తంభమునకు మ్రొక్కని వారెల్లరును వధింపఁబడుదురు'—అనునది కడకు జారీ చేయించిన కఠిన శాసనము.

విల్యంటెల్ గవర్నరువంకకు తిరిగినాఁడు. ఈతఁ డెవ్వరి కిని భయపడఁడు. అతని సహజాతిశయము నెవ్వఁడును అణఁపఁ జాలఁడు. తన దేశమునకు శాసనమువలనఁ గలిగిన సిగ్గు పాటును గుఱించి పెక్కునాళులు చింతించి కొంపిలగాసి మిత్రు

లతో ఇదివఱకే ఆలోచనలు సలిపెను. అస్వాతంత్ర్య శృంఖలా విమోచనోపాయములఁగూర్చి ఒక నిశ్చయమునకు వచ్చెను, క్రూర ప్రభుత్వ సూచకమగు అసహ్యచిహ్నమును పూజించుట కతఁడెన్నఁడును ఇచ్ఛగింపఁడు.

అతి వినమ్రులై సిపాయీలు జోహారులర్పించుచుండ, విల్యంటెల్ దగ్గఱకు గవర్నరు వచ్చి:—

'ప్రభు చిహ్నమును చూచి పరిహసించెదవా?'—అనునంతలో గుంపునుండి 'నాయనా! నాయనా!!' అను కేకలు వినఁబడె. 'ఎవరివా కేకలు?'—

ఇంటియొద్ద చెప్పకుండ సంతకు వచ్చిన విల్యంటెల్ ముద్దుకుమారుఁడు తండ్రికడకు పరువెత్తబోవుచున్నాఁడు. ఇది చూచి ప్రజలు నివ్వెఱపడిరి.

గవర్నరు ఆ కుఱ్ఱని పట్టుకొని ఆఁపి, అలక్ష్యభావముతో:—'వీడేనా ధైర్యశాలి యగు రాజద్రోహికి పుత్రరత్నము?'

టెల్:—వానిని తాకవలదు; వాఁడు నా శ్రేష్ఠపుత్రుఁడు!

గవర్నరు:—నేనేమియు చేయను. ఏదయిన హాని కలుగుచో నీవలననే కాని నావలన కలుగదు. (సిపాయీలతో) ఈ పిల్లవానిని ఆ చెట్టునకు కట్టి నెత్తిమీఁద ఒక రేఁగుపండు నుంచుము.

టెల్:—ఎందుకు?

గవర్నరు:—నీవు 'బర్గ్ లెన్ ధనుర్విద్యా పారంగత బిరుదాంకితుఁడ'వఁట కాదా! నీ ప్రావీణ్యమేదో నాకగపడు

పుము. నిజముగా నీవు ప్రాణములు గోల్పోవలసినదే ; కాని ఇపు డుల్లాసహృదయుఁడనై యుంటచే, దయ బూని నీకా అపాయము తప్పించు సంకల్పముతో నొక అవకాశ మొసఁగఁ దలఁచితిని. రమ్ము, నా మాట వినుము, నీ పెద్దకొడుకు తలపై నున్న రేఁగుపండు రెండు చెక్కలగునట్లు యిటనుండి నీ బాణముతో కొట్టవలెను. విజయము పొందితివా నిన్ను వదలెదను. కొట్టలేకపోయినను బిడ్డ కేమాత్రమైన గాయము తగిలినను ని న్నిక్కడనే ఉరిదీయించెదను.

టెల్ :—(కోపముచే కంపితుఁడై) ముద్దుబిడ్డను బలిచేసి ప్రాణములు కాపాడుకొందు ననుకొంటివా, కారుణ్య విహీనా ?

గవర్నరు:—గొప్ప ఉపకారము చేయుచున్నాను, ఆలోచించుకొనుము. అదృష్టముచే దెబ్బ సూటిగ తగిలినదా, ప్రాణము దక్కించుకొని యిల్లు చేరఁగలవు.

టెల్ :—(వణకుచున్న చేయి చాఁపి)

కణతలకు సరిగా ఒక్క అంగుళము పైకి ఉఁచ సంధింపవలసి యున్నది. కొడుకుమీద ప్రేమగల ఎవ్వఁడైన గుండె దిటవుచేసికొని కొట్టఁగలఁడా? వానివైపు చూడుము, ఆ బిడ్డవైపు చూడుము? ఎట్టి విన్యాసములతో వాఁడు నా హృదయమందు తాండవ మాడుచున్నాఁడో నీ కెట్లు తెలియగలఁడు? ఆహా! ఆ నిరపరాధుని—ఆ యమాయికపు చూడ్కులవానిని ఆ చక్కని ముఖబింబమువానిని—ఆ సుకుమారప్రాణిని నేఁ గోల్పోవలసినదేనా!

జెస్లరు:—(పశుప్రాయముగ నవ్వుచు) 'కొట్టినను సరే, చచ్చినను సరే.'

విల్:—చచ్చెదను!

జెస్లరు:—నీ కనులయెదుట నీ కుమారుని పీక పిసికించిన తరువాతనే ఆ పని.

ఉదారుఁడగు కొండదొర ఉద్రేకపూరితుఁడై—

'పిల్లను తెండు. కాని ఒక్క ప్రార్థన:—కట్టివాని మోముమాత్రము నా కగపడకుండునటులు అటుప్రక్కకు త్రిప్పవలెను, నేను చూడఁజాలను.'

తండ్రీ బిడ్డల నడుమ నొక దారి యేర్పడినది. ఇరు వైపులఁ ప్రజ క్రిక్కిరిసి యుండినది. పిల్లవాని ముఖము చెట్టు దెస త్రిప్పి, వానిని త్రాళ్ళతో బిగియఁగట్టి, ఒక పెద్ద రేఁగుపండు తలపై నుంచిరి.

మార్కెట్టు స్క్వేరంతయు చీమ చిటుక్కుమన్నను వినఁబడునంతటి నిశ్శబ్దముగ నుండెను. విల్యంటెల్ రెండు శరములు చేకొనినాఁడు. అందొకటి అమ్ములపొదిలో నుంచినాఁడు. రెండవది వింట సంధించినాఁడు. ఒక్క నిమిష మాఁగి అక్షులు మూసి యాఁదల వంచి భగవంతుని ప్రార్థించుకొనినాఁడు. ముఖమున రౌద్రరస మొలుకుచు గురిపెట్టినాఁడు, కొట్టినాఁడు! 'ట్వాంగ్!!—'

దెబ్బతో రేఁగుపండును ముక్కలుచేసి యిరువైపులఁ పడవేసి ఓఁక చెట్టును దూసికొనిపోయెను.

ఈ యద్భుత దృశ్యమునఁ గలిగిన సంతోషముచే ప్రజలు కావించిన జయజయ ధ్వానములు మింట ప్రతిధ్వనించుచుండెను.

జెస్లర్:—మంచి దెబ్బయే! కాని రెండు ఈఁటె లెందుకు తీసితివి?

టెల్:—(పొదిలోనున్న ఈఁటెపై చేయి వైచి) మొదటిదానివలన నా బిడ్డకు హానియే కలిగినచో రెండవ యీఁటె యీపాటికి నీ గుండెనడుమ దూఱియుండెడిది!

జెస్లర్:—ఓరి ద్రోహీ! నా ప్రాణములకే దలఁచితివేమి! సరే, ఇచ్చినమాట తప్పను. నీకు ప్రాణదానము చేసెదను. కాని నీవు జీవితాంతమువఱకు నా కోటలోని చీకటి కొట్లలోనే వసింపవలెను; అటులయినచో నీ బాణమువలన నా కపాయ ముండబోదు.

అంతట ముష్కరులగు సిపాయీలు టెల్‌ను తిరిగి బంధించి లంగరు వేసియుంచిన గవర్నరుగారి పడవ రేవునకుఁ గొనిపోయిరి.

పడవ 'యూరీ' సరస్సు దాఁటుచుండగా గొప్పతుపాను వీచుటచే నెల్లరును భీతాత్ములై యుండిరి. ఆస్ట్రియనులకు ఆసువులపై ఆశ లంతరించినవి; పడవ నెటు నడుపుటకును దోపక అంతయు అగమ్యముగ నుండెను.

ఉపద్రవకరమగు నిట్టి స్థితిలో—పడవ నడుపుటయందు టెల్ మహాప్రవీణుఁడను సంగతి జ్ఞప్తికి వచ్చి గవర్నరుతో వారు ప్రస్తావించిరి.

అతనిని బంధముక్తునిఁ జేసి చుక్కాను చేతి కిందని జెస్లరాజ్ఞాపించెను. టెల్ పడవను అవ్వలి యొడ్డునకు మరలించెను. ఇపుడతఁడు జెస్లరునుగుఱించి కాని ఆస్ట్రియనుల గుఱించి కాని యెంతమాత్రము యోచించుటలేదు. తన స్వాతంత్ర్యము—తన మాతృభూమియగు స్విడ్జర్లండు స్వాతంత్ర్యము—వీని గుఱించియే తలపోయుచుండెను.

పడవ నొక గుట్టదరికిఁ జేర్చి నిలిపి, తా నీవలికి దుమికి ఆస్ట్రియనులను వారి కర్మమునకు వదలెను.

చుఱుకైన నడక గలవాఁడగుటచే గుట్టలు మెట్టలు సుకరముగ దాఁటి కొండలపైనుండి ఒక కాలిబాట బట్టెను. జెస్లరు ప్రాణముఁ దక్కించుకొనఁ గలిగినచో ఈ బాట మీఁదుగనే పోవలసి యున్నది. ఇచ్చట రోడ్డుప్రక్కను తుప్పలలో టెల్ దాఁగుకొని ఱొఁచ సంధించి 'ఎప్పుడీ క్రూరుని బంధము నుండి నా స్విడ్జర్లండును విముక్తము చేయఁగలుగుదునా!' యను సంతతదృష్టితో సంసిద్ధముగ నుండెను.

అనుకొన్నట్టుగనే కొంచెము సేపటికి అడుగుల చప్పుడు వినవచ్చినది.

జెస్లర్ నడచుచు:—

'నేనే ప్రాణములతో 'అల్ట్‌డార్ఫ్' చేరఁగలిగితి నేని టెల్ యొక్క కుటుంబమును సర్వనాశము చేసెదను. ఇదే నా ప్రతిజ్ఞ. తల్లిని పిల్లలను అందఱను ఒక్క పెట్టున పరిమార్చెదను' అనుచు ఆ నాటుబాటను పోవుచుండెను. ప్రక్క పొద నుండి 'ట్వాంగ్' మను ధ్వనితో ఒక నిశితమగు శరము వచ్చి

జెస్లరు హృదయమును దూసికొనిపోయినది. అతడు ప్రాణములు వదలి నేలఁ గూలినాఁడు.

*   *   *

తరువాత విల్యంటెల్ స్విస్ ప్రజలను పురికొల్పి ఆస్ట్రియాపైకి దండెత్తి జయము గాంచెను. నాఁటినుండియు స్విడ్జర్లండునకు దాస్య శృంఖలలు విడువడినవి !

స్విస్ దేశస్థులు టెల్‌ను ప్రభువుగా నేర్పఱచుకొనఁ గోరిరి కాని యతఁడందుల కంగీకరింపలేదు. వేయి రాజ్యముల పెట్టు అగు తన 'శైల కుటీరము'లోనే అత్యంత శాంతి సౌఖ్యములతో జీవిత శేషము గడుపుకొనెను !



# నిలుకడమీఁద నిజము

[తఱుచు, దుష్టుల కభివృద్ధియు శిష్టులకు కష్టగండ్లును కల్గుచుండుట ఈ ప్రపంచమున పరిపాటియై జూపట్టుచున్నది. ఇట్టి విడ్డూరమును గూర్చి ధర్మజునంతటివాఁడే సంశయ కలితుఁడయ్యెఁ, కాని—తుదకు 'ధర్మమే జయించు' ననియు, అదియె మానవకోటికి మార్గదర్శక మగునని మన శ్రుతి స్మృతి పురాణాదులు చెప్పునది రిక్తమాటలు కాదు. ముమ్మాటికిని కాదు. ఇందలి యాదార్థ్యమును గుర్తింపఁగలుగు నంతటి ఓరిమియు ఓపికయు మాత్రము కలిగియుండవలె. ఈ కథయందలి కరుణాకరుఁడు ఒకానొక ధర్మసూత్రము తెలుసుకొనునప్పటికి తన జీవితమునే బలిచేయవలసివచ్చె!]

---

*కరుణాకరుఁడు సహజ సుందరమయిన యువకుఁడు. ఉంగరములు తిరిగి ఆ శిరోజము లతని చక్కఁదనమునకు శోభను రెట్టించినవి. హాస్యవచనాభిలాషి, సంగీతప్రియుఁడు, స్వవృత్తినిరతుఁడగు నతఁడు ఒకనాఁడు నాణెమయిన సరుకు తీసికొని కాకినాడకు పయనమయ్యెను. 'పోయి వచ్చెద' నని భార్యతో చెప్పఁగా నాఁటికి ప్రయాణము మానివేయుఁడని ఆమె ప్రార్థించినది.

అతఁడు (నవ్వుచు)—ఎందుచేత ?

---

* 1872 లో టాల్‌స్టాయ్ మహర్షి వ్రాసిన 'God sees the truth but waits' అను కథ దీని కాధారము.

ఆమె—నేనొక పాము కలఁ గంటిని. మీరూరనుండి తిరిగివచ్చి తలపై టోపీ తీయుసరికి నెత్తియంతయు నరసి ముగ్గుబుట్టవలె తెల్లనైనది!

అతఁడు (మందహాసముతో):—అది శుభసూచకమే సుమా! సరకింతయు విక్రయించి నీవు కోరుకొనిన బహుమతులు కొనివచ్చుసరికి నీవు తెల్లబోయెదవన్నమాట!—అనుచు బయలుదేఱెను.

పనిమీఁద నతఁడు అనకాపల్లిలో ఆగెను. అల నొక వణిజ్మిత్రుఁడు కనఁబడినాఁడు. ఆనాఁడున ఒక హోటలునందే బసచేసి, ఉభయులును కలిసి కాఫీ పుచ్చుకొని రాత్రిపూఁట ప్రక్కగదులలో పండుకొనిరి.

ఎండలకడ నిద్రపోయి చల్లప్రొద్దున పయనము సలుపుట కరుణాకరునకు నభ్యాసము. ఆయలవాటు చొప్పున తెల్లవారుజామునని మోటారు సిద్ధము చేయించి హోటలు యజమానుని కీయవలసినది చెల్లించి వేసి ప్రయాణము సాగించెను.

తునిలో ముకాము చేసి అట నతఁడు విశ్రాంతి గైకొనెను. డ్రైవరు కారునకు పెట్రోలు వేసి సిద్ధము చేయుచుండెను. సేవకుఁడు కాఫీ తయారు చేయుచుండెను. కరుణాకరుఁడు గ్రామోఫోను తీసి క్రొత్తగా కొన్న కొన్ని ప్లేటులు పాడించుచు ఆనందపరవశుఁడై యుండెను.

ఆ స్థితిలో హఠాత్తుగ నొక కారులో నల్గురు పోలీసులతోకూడ జిల్లాపోలీసు సూపరింటెండెంటు అక్కడకు వచ్చి "నీ వెవరవు? ఎక్కడనుండి వచ్చితివి?" అని కరుణాకరు నడిగెను.

అతఁడు ప్రత్యుత్తరము లిచ్చుచు 'దయచేయుఁడు, కొంచెము కాఫీ తీసికొందురుగాని' అని సవినయముగ ఆయన నాహ్వానించెను. కాని అధికారి ఊపిరాడకుండ మరల నిట్లు ప్రశ్నింపఁ గడంగెను : 'గతరాత్రి నీ వెటనుంటివి? ఒంటిగ నుంటివా, ఎవరయిన నేస్తుని కూడియుంటివా? ఆ మిత్రుని ఈ యుదయమున చూచితివా, లేదా? అంత తెల్లవారక మునుపే బస ఏల విడిచితివి ?...'

తరచి తరచి ఏల యింతగ ప్రశ్నించుచున్నాఁడో యని అతఁడు విస్మితుఁడై, జరిగిన వృత్తాంత మంతయు పూస గ్రుచ్చినట్లు చెప్పెను: 'అయ్యా! నేనేమో దొంగనైనటు లెందుల కిట్లు యక్షప్రశ్నలు వేయుచున్నారు ? నా వ్యాపారమునీఁద నేఁ బోవుచుంటిని; ఇంతకంటె నా కేమియుఁ దెలియదు.'

అంతట నధికారి భటులను పిలిచి అతనితో:— రాత్రి నీతో నుండిన వర్తకుని ఎవరో కుత్తుక ఉత్తరించి చంపినారు, నిన్నిట్లు గ్రుచ్చిగ్రుచ్చి అడుగుట కిదే హేతువు. ఇపుడు నీ సామానులు సోదా చేయవలసి యున్నది.

అధికారి సంజ్ఞపైని భటులు కరుణాకరుని సామానులన్నియు వెదకసాగిరి. ఆయనకూడ స్వయముగ వెదకుచుండఁగా ఒక సంచిలో నొక కత్తి కన్పడినది. గభాలున దానిని పైకి తీసి 'ఇదియేమి ?' అని కేక వేసినాఁడు.

రక్తసిక్తమై యున్న ఆ కత్తిని తన సంచినుండి అధికారి తీయుట గని, అతఁడు భయకంపితుఁ డయ్యెను. 'ఈ కత్తి యేమి ? ఈ రక్తమేమి?' అని ఆశ్చర్యపడినాఁడు. అధికారి

ప్రశ్నకు బదులు చెప్ప యత్నించెను గాని గళము స్తంభించి పోయి నోట మాట రాకపోయెను. కష్టముపైన తడఁబడు మాటలతో 'నే నె-ఱుఁ-గ-ను,...నా-ది-కా-దు' అనెను.

అధికారి:—ఈ యుదయమున వర్తకుఁడు పీకఁ తెగి చచ్చి పడియున్నాఁడు. ఈ పని నీవే చేసి యుండవలెను. ఇంటి తలుపు లోపల తాళము త్రిప్పఁబడియున్నది, అట మఱెవ్వరును లేరు. ఇదిగో, ఇక్కడ రక్తమయమైన కత్తి నీయొద్ద దొరకినది. నీవే ముద్దాయివైనటులు నీ వాలకమే చెప్పుచున్నది. ఎట్లు చంపితివి? నిజము చెప్పుము.

'నే నేపాప మెఱుఁగను, ఎఱుఁగను దేవుఁడా!' యని కరుణాకరుఁడు చేతిలో చేయి వేసి ఒట్టుపెట్టుకొనినాఁడు; రాత్రి పడుక కేగిన పిమ్మట మిత్రుని జాడయే తెలియలేదని మొఱ వెట్టినాఁడు. ఆ కత్తి తనది కాదని మఱి మఱి నమ్మఁబలికినాఁడు. కాని స్వరము హీనమైనది, ముఖము పాలిపోయినది. అపరాధివలె అతఁడు కంపించిపోవుచుండెను.

బేడీలు వేసి కారులో కూర్చుండఁబెట్టుఁడని అధికారి భటుల కాజ్ఞాపించినాఁడు. కరుణాకరుని కట్టి కారులో నెక్కించునపుడు మాఱుమొగము పెట్టుకొని వెక్కి వెక్కి యేడువ నాగెను. అతని లోడ్డు లోసుగు అంతయు పోలీసువారు అధీనము చేసికొని అతని జైలునకు గొంపోయిరి. కేసు విచారణకు వచ్చినది. కోడి వర్తకుని చంపినట్టును ఇరువది వేలు హరించినట్టును నేరము స్థిరపడినది.

ఈ వైనము తెలిసి కరుణాకరుని భార్యకు మతిపోయినది; ఏమాటయైన నమ్ముటకుఁగాని, నమ్మకపోవుటకుఁగాని

పాలుపోకుండెను. పాపము, పిల్లలు పసిపాపలు! ఒకఁడెడబిడ్డ, ఒకఁడొడిబిడ్డ. వీరిని వెంటనిడికొని ఆమె పతిచెంతకు పయనమైనది. భర్తను చూడ వలనుపడదని జైలు ఉద్యోగస్థులు ఆమెను మొదట నివారించిరి. కాళ్ళ వ్రేళ్ళఁబడి అనేక విధముల వేఁడుకొన్నపిమ్మట అందుల కనుమతించిరి. ఆ జెయిలు దుస్తులతో, ఆ బేడీలతో కేడీల నడుమ నున్న తన భర్త యవస్థ గని ఆమె స్మృతిదప్పి క్రిందఁబడి, చాలసేపటికిఁ గాని తెప్పిఱిల లేకపోయినది. తెలివి వచ్చినపిమ్మట కనుఁగొందులను చేరఁదీసికొని భర్త సమీపమున కూర్చుండినది. గృహ విషయములు ముచ్చటించినపిదప అతని చరిత్ర నడిగి తెలిసికొనినది. జరిగిన కథ యంతయు అతఁడు దాఁపక చెప్పినాఁడు.

ఆమె:—అయినచో మన మిపుడు చేయునదేమి ?

కరుణాకరుఁడు:—శిక్ష రద్దుపఱుపఁగోరుచు అధికారులకు విన్నవించుకొనవలెను.

ఆమె:—అయినది అపుడే అయినది. వీలులేదని చెప్పి మనవి నిరాకరించినారు. శిక్ష ఖాయపరచియున్నారు.

అతఁడు మాఱుమాటాడక అధోదృష్టిఁ బఱపి అటులే కూర్చుండెను.

ఆమె:—నా కా పీడ కల వచ్చినందులకు ఊరక పోలేదే! మీకు జ్ఞప్తియున్నదో లేదో, మీ తల నరసిపోయినటులు కలగంటిని కాదా! నా ప్రార్థన మంగీకరించి ఆనాఁడు ప్రయాణము మానివేసిన నెంత బాగుండెడిది! (వ్రేళ్ళతో అతని కురులు నిమురుచు) నాతో నిజము చెప్పుఁడు, ఆ చంపినది నిజముగ మీరు కాదా ?

కరుణాకరుఁడు:—ఏమీ! నీవు—అయ్యో! నా అర్ధాంగివైన నీవును—నన్ను నవమానించుచుంటివా!

అని మొగము చేతులతో కప్పుకొని బావురు మని పెద్ద పెట్టున నేడ్చెను. అంత నొక సేవకుఁడు వచ్చి ఆమెను పిల్లలను వెంటనే అటనుండి వెడలిపొండని కసరగా కరుణాకరుఁడు తన కుటుంబమును కడసారి చూపు చూచుకొనినాఁడు! కంపితకరములతో కన్నబిడ్డల నెత్తుకొని తుదిముద్దు లిచ్చి నాథా! ఎలుఁగెత్తి జాలిగా నేడ్చెడి భార్యను విడువలేక విడువ లేక దుఃఖబాష్పములతో విడిచినాఁడు!

వారు జైలుగుమ్మము దాటినవెంటనే ఆ ప్రసంగ మంతయు జ్ఞప్తికి దెచ్చుకొని తన సతియే తనపై నవమాన పడిన దను సంగతి తలఁపునకు వచ్చి చింతించినాఁడు— 'నిజము దేవుఁడెఱుఁగును. పరమేశ్వరుని ప్రార్థించిన మేలు, మానవుని అర్థించుట వ్యర్థము, అవమానకరము కూడను. రక్షించినను శిక్షించినను ఆ జగన్నాటకసూత్రధారుఁడే.'

మనుజులవలన పొందగల ఉపకృతి శూన్యమను ఉద్దేశముతో—పురాకృత కర్మఫలమును తప్పింప నేరికిని శక్యము కాదను నమ్మికతో—అధికారుల కిఁక ప్రార్థనా పత్రములు పంపుకొనుట కట్టిపెట్టినాఁడు. ఈ విషయమున అధికారులు సాహాయ్యము చేయుదురను ఆశను మానుకొని అంతటినుండి భగవద్ధ్యానపరాయణుఁడైనాఁడు.

పిదప—అతనికి విధించిన శిక్షప్రకారము భటులు ఒక ఇనుపకొరడాతో కరుణాకరుని చావమోఁదిరి. ఆ గాయములు

మానిన పిమ్మట తక్కిన ఖైదీలతో పాటు అతనినికూడ ద్వీపాంతరము పంపి వేసిరి.

పాపము! అతఁడు ఇరువదియారు దీర్ఘవత్సరములు దీవ్రులలో జీవితము గడపినాఁడు. కేశములు ముగ్గువలె తెల్లపడినవి. గడ్డము పొడవుగా సన్నముగా బలిసి బూడిదరంగు కలిగియుండెను. చెల్లాగుమే యుడిగిపోయినది. కష్ట జీవనముచే కృంగి కృశించినాఁడు. అతఁడిపుడు అడుగులు నెమ్మదిగ వేయును. అతి మితముగ భాషించును. నవ్వు అనునది ఎప్పుడో నశించిపోయిన దాతనిలో. ఇప్పుడు ఈశ్వర చింతనము తక్క వేఱు వ్యాసంగము లేదు.

ఆతనికి చిన్నతనమునుండియు చేతిపనులు చేతనగుటచే చాఁపలు పసరలు అల్లుచు, అవి యమ్మి కొంత ఆర్జించినాఁడు. దానితో తనకు ప్రియతమములగు కొన్ని ఆధ్యాత్మిక గ్రంథములను కొని, జైలులోని తీరికసమయమంతయు పుస్తకపఠనములో వినియోగించుచుండును. రాత్రిపూఁట చాలసేపు 'భక్తియోగము'ను గూర్చిన దివ్యోపన్యాసము లొసఁగి మిత్రబృందమునకు ధన్యత చేకూర్చును.

ద్వీపములోని జైలుఉద్యోగస్థులు సౌశీల్యదక్షుఁడయిన కరుణాకరుని మిక్కిలి ప్రేమించి గౌరవించుచుండిరి. తోడి ఖైదీలు అతనిని 'తాతా! తాతా!' యని భక్తిపూర్వకముగా పిలుచుచు పూజించుచుండిరి. అధికారుల కేదయిన అర్జీ పంపుకొనవలసినచో ఇతఁడే ముసాయిదా వ్రాయవలెను. ఖైదీలలో నేసయిన పేచీలు వచ్చినచో అవి దిద్ది తీర్పుచెప్పు న్యాయాధిపతియు నితఁడే!

కరుణాకరునకు ఇంటి సంగతు లేమియు తెలియవచ్చుట లేదు. ఆలు బిడ్డలు బ్రదికియున్నారో గతించినారో కూడ ఎఱుఁగరాదాయెను.

ఇట్లుండ—ఒక దినమున క్రొత్త ఖైదీల గుంపు దిగినది. ఆ సాయంకాలము ప్రాత ఖైదీలందఱు క్రొత్తవారి చుట్టును మూఁగి ఎవరెవ రేయే యూళ్ళనుండి వచ్చిరో, ఏయే నేరములకు శిక్షను పొందిరో కనుఁగొనఁ జొచ్చిరి. కరుణాకరుఁడొక మూల కూర్చుండి దృష్టి క్రిందికిఁ బఱపి అటే చెవి యొగ్గి వినుచుండెను.

క్రొత్తఖైదీలలో నొకఁడు ఆజానుబాహువు, అఱువదేండ్లవాఁడు, నరసిన ఒత్తుగడ్డము కలవాఁడు—తానేల శిక్షింపఁబడెనో ఇట్లు నివేదించెను:—'నా సంగతి చెప్పెదను వినుఁడు! బండికి కట్టియున్న ఒక గుఱ్ఱమును తోలుకొనిపోయితిని. ఇదే నేఁజేసిన తప్పు. దొంగతనము నేరము మోపి నన్నుఁబట్టి శిక్షించిరి. ఇంటికి త్వరితముగ వెళ్ళవలసిన అగత్యముండుటచే దానినెక్కి వెళ్ళి, తిరుగ నటనే వదలివేసితిని. అదియుఁగాక సారటువాఁడు నాకు కావలసిన మిత్రుఁడు. ఎంతకును ఈపని అతనికి అంగీకారమే. అందుచేత దోషమారోపించుట న్యాయము కాదని నేను వాదించితిని. 'అదంతయు మాకు తెలియదు, నీవు దొంగవు' అని కోర్టువారు శాసించిరి. నే దొంగిలిన విధానము ప్రదేశము మున్నగునవి ఋజువుపఱుపఁదగిన బలమగు ఆధారములు వారికి లేవు. అయినను అధికారబలమును ఆటంకపఱుపఁగలవా రెవ్వరు? మున్నొక పర్యాయము నిజముగనే తప్పొనరించియుంటిని;

న్యాయ్యముగ అప్పుడే నేను పట్టుబడవలసి యుండెను కాని తప్పించుకొనిపోయితిని. ఇప్పుడు సరియైన నేరము చేయకున్నను నిష్కారణముగ శిక్షింపఁబడితిని...'

(ఎగతాలిగ నవ్వుచు)

హా-హ్హా-హ్హా! అన్నియు ఉత్తమాంటలే! ఈ వలకప్పుడే ఇటకొక పర్యాయము వచ్చియుంటిని, ప్రాత పిల్లినే! కాని అక్టెకాల ముండలేదు.'

ఒకరు:—మీదే యూరు?

అతఁడు:—నాది విశాఖపట్టణము, నా పేరు రాయప్ప.

కరుణాకరుఁడు (తల పైకెత్తి):—ఏమయ్యా, రాయప్పగారూ!—మీయూర కరుణాకరుఁడను వర్తకు నెఱుఁగుదురా? అతని కుటుంబమువా రింకను ఎవరయిన జీవించియున్నారో?

రాయప్ప.—ఎఱుఁగకేమి? యజమానుఁడు ద్వీపాంతరము పంపఁబడినాఁడు గాని అతని పుత్రులు శ్రీమంతులై నిక్షేపమువలె కాలక్షేపము చేయుచున్నారు. అతఁడు పాపము! మావలెనె పాతకుల చిట్టాలోని కెక్కి ఇట నరక మనుభవించుచున్నాఁడఁట!—తాతా! నీవేల వచ్చితివి?

తన దుస్థితిని వెలిపుచ్చుటకు కరుణాకరుఁ డిచ్చగింపలేదు, ఒక్క నిట్టూర్పు విడిచి—'చేసికొన్న పాపములు కట్టి కుడుపకుండునా? దాచికొనిన ఏనాఁటి సంచితార్థమో ఈ యిఱువది నాఱు వత్సరముల నుండియు ననుభవించుచున్నాను.

తప్పునా? గత జన్మములో ఏ ఆలు మగల కెడఁబాపులు చేసితినో?'

రాయప్ప:—ఏమి తప్పు చేసితివి?

కరుణాకరుఁడు:—ఏమియు లేదు. ఈ శిక్షకు తగి యుంటిని కనుకనే దానిని పరమేశ్వరుఁడు నాకు విధించినాఁడు.

అతఁడిఁకేమియు చెప్పదలచుకొనలేదు. కాని, దగ్గఱివారు—తుచ్ఛుఁడొకఁడు ఖూనీ చేసి ఆ కత్తి ఇతని సామగ్రిలో దూర్చిన విధమును, దానిపై నిర్హేతుకముగ నితఁడు ముద్దాయిగా నిర్ణయింపఁబడి శిక్ష పొందినట్లును రాయప్ప కెఱింగించిరి.

ఈ యుదంతి మాలించినతోడనే రాయప్ప కరుణాకరుని వంక అట్టె ఒకపరి చూచి మోఁకాలు తట్టుకొని విస్మయముతో:— 'ఏమీ చిత్రము! ఏమీ విచిత్రము!! ఈశ్వర విలాసము దుర్గ్రాహ్యము కద!—కాని, తాతా! ఎంత ముసుసలివైపోయినావు!'

"అంత వింతగ నడుగుచుంటివే! పూర్వ పరిచయమేమైన నున్నదా యేమి?' అని యచటివారు రాయప్ప నడిగిరి. అందుల కతఁడు మాఱు వలుకక 'ఉభయులము నిచట సమావేశమగుటయే అద్భుత విషయము" అని నుడివి మిన్నకుండెను.

వర్తకుని ఖూనీ వైనము రాయప్ప కేమాత్రమో తెలిసియుండవలెనని సంభాషణమును బట్టి యూహించి కరుణాకరుఁడు:—"ఏమండీ, రాయప్పగారూ! వర్తకుని ఖూనీవార్త

పనియుంటిరి కాఁబోలు నేమి! లేక నన్నెచటనయిన వెనుక చూచిన జ్ఞాపకమో...?"

రాయప్ప:—చెవులు గింగురుమనుచుండ వినకుండ నెటులుండుట! లోకములో వేయి వదంతులు వ్యాపించి యున్నవి. అబ్బో! అదేనాటి ముచ్చట! నాకపుడే పరగడుపే యైనది!

కరుణాకరుఁడు:—కాని, చంపిన దెవరో మీకు తెలియు ననుకొందును.

రాయప్ప:—(నవ్వుచు):—కత్తి ఎవరి సంచిలో దొరకెనో వారే చంపియుండవలెను! మఱెవ్వరయిన చంపి ఆ కత్తిని సామానులలో దాఁచినను హంతకుఁడు పట్టువడు పర్యంతము ముద్దాయివి నీవే...! అయినను, మనలో మనమాట— నీ తలక్రింద పెట్టుకొనిన సంచిలో ఇతరు లెట్లు కత్తి దూర్పఁ గలరయ్యా! నీకు మెలకువ వచ్చియుండదా యేమి?

రాయప్ప వికటపు మాటలు వినిన వెంటనే ఈ పని ఇతనిదే యని కరుణాకరుఁడు నిర్ధారణము చేసికొని తత్క్షణమే అచటనుండి సాగిపోయెను. రాత్రియంతయు నిద్దురపట్టక చెప్ప రాని వేదన పడెను. భావనాప్రపంచములో— జీవితాంతము వెల్ల హృదయఫలకమున బయస్కోపు చిత్రములవలె ప్రతి బింబితములైనవి. కాకినాడ వెళ్ళఁబోవునపుడు 'వలపు వల' యని వారించిన సతి స్వరూపము: అదిగో, అతని సమక్షమునందు! చిఱునవ్వు చిందులాడుచున్న ఆ మోము, ఆ విశాల నయనములు, ఆహా! లలితపదములతో, మృదుమధురములగు అమృతవాక్కులతో ఎంత సవినయముగ వేడుకొనుచున్నది!—

పాపము! చిన్నారిపాపలు—ఫ్లానెలు కబ్బా తొడుగుకొనిన ఎడ
బిడ్డ, తా నెంతో పెద్దయైనటులు మారము సేయుచున్న
చిన్నితమ్ముని ఊఁఅడించి లాలించుచున్నాఁడు!—ఇఁక స్వీయ
చరిత్రము స్మృతికి వచ్చినది; మరల ఆనందింప వలనుకాని
ఆ చిన్ననాఁటి సుదినములు, తుని హోటలులో ఉత్సాహా
పూరితుఁడై గ్రామఫోను పాడించుచుండిన ఆ మహానంద సమ
యమునందే అరెస్టు కాఁబడుట, ఆనుపరి తాను కొరడాతో
శిక్షింపఁబడుట, కొట్టిన తలారివాఁడు, చేతుల బేడీలు, తోడి
ఖైదీలు—ఈ ఇరువదియారు వత్సరములు ద్వీపములోఁ
గడపిన దుర్భర జీవితము—అసహజముగ ప్రాప్తించిన అకాలవృ
ముదిమి—ఇవన్నియు తన కండ్లయెదుట సాక్షాత్కరించినవి.
ఇట్టి అభాగ్యజీవనముకంటె ఆత్మహత్యయె మేలని తోఁచినది.

'ఈ క్రూరునివలనఁగద ఇన్ని కడగండ్లు!' అని పండ్లు
పటపట కొరికినాఁడు. తానేమైపోయినను సరే, తమ్ముని హత
మార్చి పగదీర్చుకొనవలెనన్నంత కోప ముద్రేకించినది. రాత్రి
యంతయు ప్రార్థనము చేసికొనినాఁడుగాని మనస్సు నిలుకడ
లేకుండెను. పగటిపూఁట రాయప్పను చూచుట మానుకొను
బడెనుగాక, ఎప్పుడైన అతఁడగపడెనేని పెడమొగము
పెట్టెడివాఁడు.

పక్షము గడచినది. కరుణాకరునకు కంటిమీఁద
కునుకు లేదు. ఏమి చేయుటకును పాలుపోక తీవ్రబాధా
పీడితుఁ డయ్యెను.

ఒకనాఁటి రాత్రి—కరుణాకరుఁడు జైలులో ఇటునటు
పచారుచేయుచు, బందాలు పండియున్న ఒక కొట్టులో

అలమారుప్రక్క నెవరో తొలుచుటచే మన్ను వచ్చుట గనెను. అదేమో చూతమని అట్టె నిలువఁబడి, ఆ క్షణముననే భయకంపితుఁడయిన రాయప్ప అలమారుప్రక్క నిలువఁబడి కరుణాకరుని దెసఁ తొంగిచూచినాఁడు. కరుణాకరుఁడు తన దారిని పోవుద మనుకొనినను రాయప్ప అతని చేయి పట్టుకొని నిలువఁబెట్టి—తాను జెయిలుగోడ దొలిచి కన్నము చేయుచుంటిననియు, అందఱును పనిమీఁద పైకి పోయినపుడు జోళ్ళతో మన్ను అవల పాఱఁబోయుచుంటి ననియు చెప్పి, మఱియు నిట్లు బెదరించెను:—

'తాతా! మిన్నకుంటివా నీవుకూడ దాఁటిపోవఁగల ఉపాయము చేసెదను. రహస్యము బయలుపెట్టితివా అధికారులు నా యసువులు తీయుటకు ముందే నీ ప్రాణములు నేను పుచ్చుకొందును, జాగ్రత్త!'

కరుణాకరుని యొడలు కంపించెను. రాయప్ప పట్టు నుండి చేయి లాగికొనుచు:—'నాకు తప్పించుకొను సంకల్పము లేదు. నీవు నన్ను చంపు అగత్య మంతకంటెను లేదు. ఇపు డేమి? చిరకాలము క్రిందటనే నీవు నన్ను బలి కొనియుంటివి! ఇఁక—నిన్ను బయలుపఱచుటా మానుటా. అనునది ఈశ్వరేచ్ఛ!'

మఱునాఁడు—ఖైదీలందఱును పనికిఁ బోవు సమయాన—గోడ కెవరో కన్నము తొలచుచున్నట్టును, జోళ్ళతో మన్ను ఎత్తిపోయుచున్నట్టును ఒకఁడు కనిపెట్టెను. జైలు భవనమంతయు సోదా చేయఁగా రంధ్రము స్పష్టముగ కనఁ

బడినది. అధిపతి వచ్చి ఆ చేసినదెవరో వాస్తవము చెప్పుఁడని ఎల్లరను ప్రశ్నించెను. ఎవ్వరును బదులుచెప్ప లేదు. అపరాధిని ప్రాణము తీయుదురను భీతిచే పాపమున కొడిగట్టుకొన నిచ్ఛగింపక ఎఱిఁగినవారుకూడ చెప్పుటకు సాహసింపఁ జాలకుండిరి. కరుణాకరుఁడు పెద్దమనుష్యుఁడు న్యాయశీలుఁడు అను విశ్వాసముతో అధికారి చివర కతనియొద్దకు వచ్చి:—'తాతా! నీ వబద్ధమాడవని నాకుఁ దెలియును. దైవముఖము చూచి ఈ పని చేసిన దెవరో చెప్పు' మని అడిగెను.

కరుణాకరుని వైపు తదేక దృష్టితోను అధిపతిపంక తనకు ప్రసక్తి లేనట్లు నిర్లక్ష్యముగను రాయప్ప చూచుచుండెను. కరుణాకరునకు చాలసేపు పెదవులు వణఁకి నోట మాట రాలేదు. 'నా జీవితము నాశము చేసిన హంతకుఁడు వీఁడు; నిజమే. అయినను నేనేల బయలుపెట్టవలెను? రహస్యము వెల్లడించితినా ఇతని ఆయువు మూడినదన్నమాట! ఒకవేళ—నాకు ద్రోహము చేసిన యతఁ డితఁడేయని అనుమానించుటలో పొరపడితి నేమో! ఇంతకును వాని శిక్షింపించుటలో నాకు కలిసివచ్చున దేమి?' అని దీర్ఘాలోచనములోఁ బడినాఁడు.

మరల అధిపతి:—ఏమోయి తాతా! నిజము చెప్పుము. ఎవరీ రంధ్రము తొలుచుచున్నారు?

రాయప్పవైపు ఒక పరి చూచి, కరుణాకరుఁడు: 'అయ్యా! నేఁ జెప్పఁజాలను. చెప్పుమని దైవాజ్ఞ కాలేదు. నా సర్వస్వము తమ అధీనము, ఏమిచేసినను సరే!'

ఎన్నివిధముల యత్నించినను కరుణాకరుఁ డంతకంటె నేమియు చెప్పకుండెను. అందుచే ఆ విషయ మువేక్షింపఁబడెను.

* * *

రాత్రి కునుకు పట్టుననఁగా ఎవరోకాని చప్పుడు చేయకుండ వచ్చి కరుణాకరుని ప్రక్కమీఁద కూర్చుండె. ఆ చీఁకటిలో నతఁడు కనులు చిట్లించి చూడఁగా, అతఁడు రాయప్పరే!

కరుణాకరుఁడు.—ఇపు డిట కేల వచ్చితివి? నన్నింకను ఏమిచేయుమనెదవు?

రాయప్ప:—(ఊరకుండెను.)

కరుణాకరుఁడు:—(లేచి కూర్చుండి) ఏమి కావలెను? వెళ్ళిపోయెదవా, గార్డును పిలువనా?

రాయప్ప:—(దగ్గఱకు వంగి రహస్యముగా)—తాతా! కరుణాకరా!! క్షమింపవా?

కరుణాకరుఁడు.—ఎందులకు?

రాయప్ప:—వర్తకుని చంపి కత్తి నీ సంచిలో దాఁచిన వాఁడను నేనే! నిన్నుకూడ అప్పుడు పరిమార్పవలసినదే. కాని బయట నేదో అలజడి యగుటచే కత్తి నీ సంచిలో దూర్చి కిటికీగుండా పాఱిపోయితిని.

ఏ మనుటకు కరుణాకరునకు మాట రాలేదు.

రాయప్ప:—(ప్రక్క దిగ్గి నేలమీఁద మోకరిల్లఁబడి):—తాతా! వర్తకుని చంపినది నేనే యని తప్పొప్పు

కొనెదను. నిన్ను వదలెదరు, నీవు ఇంటికి పోవచ్చును. నన్ను క్షమింపుము.

కరుణాకరుఁడు:—నాయనా! మాట లెంత సులువుగా చెప్పుచున్నావు. ఈ యిరువదియేండ్లును నే నెంత కుందితినో, ఆలుబిడ్డల కెడమైపోయి ఎంత తపించితినో, ఇంచుకైన గ్రహింపఁగలవా? ఇప్పుడు తిప్పించుకొని నే నెక్కడికి పోవుట? భార్య చచ్చినది. పిల్లలు నన్ను మఱచిరి. ఇంక నేఁబోవలసినది... కాటికే!

రాయప్ప అతని పదము లంటి లేవక నెత్తి నేలను కొట్టుకొనుచు—"తాతా! తాతా!! శరణుజొచ్చితిని, క్షమింపుము! సదయహృదయా! క్షమింపుము! తలారులు ఇనుపకొరడాతో చెళ్ళుచెళ్ళుమని మోదినపుడయినను— ఇపుడు నిన్ను చూడఁగా పొంగి పొరలు దుఃఖము, ఆ వేదన, పొందియెఱుఁగను. మనసు అంతగా ద్రవించిపోవుచున్నది. హృదయ మంతగ ఉడికిపోవుచున్నది......నీ మనస్సు చాల ఉదారమైనది. నీ కింత కీడు చేసినను, దయఁబూని రహస్యము బయల్పరుపక ఊరకుంటివి నే! అబ్బా! ఏమి జాలిగుండె!! క్షమింపుము, తాతా! క్షమింపుము. పరమపాతకుఁడను!!!"— అనుచు పట్టరాని సంతాపముతో పరితపించెను.

కరుణాకరుఁడుకూడ దుఃఖ మాఁపుకొనఁజాలక నుర పిల్లెను. కన్నీటిధారతో నతఁడు—'రాయప్పా! పరమేశ్వరుఁడు నిన్ను కృపఁ జూడఁ గలఁడు! నీకంటె నధిక పాపిని కనుక నే ఇట్టి యిడుములకు నన్ను పరమేశ్వరుఁడు పాల్పరచెను.'

కరుణాకరునకు హృదయము తేలిక యైనది. ఇంటి మీఁది చిరవాంఛితము క్రుంగిపోయినది. శేషజీవిత మట్లనే గడుపుచు అస్తమయ సమయమునకై నిరీక్షించుచుండెను.

తరువాత రాయప్ప తప్పొప్పుకొనినాఁడు. సుబ్బకడు మీఁద నిజము తేలినది. విడుదల ఉత్తరువు వచ్చినది. కాని, అప్పటికే కరుణాకరుఁడు ఇహలోకమును విడిచిపోయినాఁడు!

---

# తపాలా రన్నరు

[ఆ రాజపుత్రి పరమ సాధ్వీలలామ. అత్యంతము భర్తకు అనుకూలవతి. అయినను, అనుక్షణము నామెను భర్త అనుమానించుచు అవమానించుచు ఆడిపోయుచునే యుండెను. అతఁడు జీవిత లక్ష్యము లేని ఒక పోటుమానిసి యని గ్రామీణులే నిశ్చయించిరి. దయా దాక్షిణ్యము లెఱుఁగని ఆ రాజపుత్రుఁడు ఆమెను కాళరాత్రిలో నొంటిపాటుగ విడిచిపుచ్చినప్పటికి, త్యాగ మహిమచే నామె ఎటులు ధన్యయై తరించినదో వ్యక్తపఱుచు చున్నది ఈ సౌరాష్ట్రదేశపు జాతీయ గాథ.]

---

కృష్ణపక్షమున నొక సాయంకాలము. భానుఁడు పడమటి ముఖము పట్టెను. ఆతని యడుగుల వెంబడి సందెచీఁకటి చొచ్చుకొని వచ్చుచుండెను. ఆకాశము మచ్చునకైన మచ్చ కనఁబడనంత నిర్మలముగ నుండెను. ఇప్పు డిప్పుడే అటనొకటి, ఇట నొకటి, చుక్కలు మింట మెఱయుచుండెను.

గ్రామస్థులు దైవసందర్శనమునకై ఆలయముచెంత వేచి యుండిరి. ఆటలే ఆనందముగ నెంచు అర్ధ దిగంబరులైన బిడ్డలు గుంపులుగుంపులుగ గుడిలో మూఁగుచుండిరి. వీరిలో రెండు పక్షము లేర్పడినవి: జయఘంట కొఱ కొక పక్షమువారు ; అది వాయించు సుత్తికోసము రెండవ పక్షము

వారును. అర్చకుఁ డెంత త్వరితముగ దేవునకు నివేదనము చేయునా!—తీర్థము, ప్రసాదము, బెల్లములో పొదిగిన కొబ్బెర ముక్కలు యెంత చప్పున దొరకునా!—అను నాశతో చిన్న పిల్ల లమితోత్సాహమున గంతులు వేయుచుండిరి. కాని పూజారి–బావాజీ–ఇంకను నూతిదగ్గఱ స్నానము చేయుచుం డుటచే, గుడి తలుపులు తెఱువనే లేదు. పెద్దలు తమ బిడ్డ లతోకూడ 'దర్శనము' చేసికొని పోవుద మని ఆత్రముతో మండపమునొద్ద కనుపెట్టుకొని యుండిరి. అంతయు నిశ్శబ్ద ముగ నుండెను. అంతకంతకు చీకటి గాఢ మగుచుండెను.

ఒకాయన:—అబ్బ! నేటి సాయంకాల మదోక మోస్తరుగ నున్నదండీ! ఏమియు తోచుటలేదు.

రెండవ యతఁడు:—తోఁచకపోవుటయే కాదు. కని పెట్టితిరో లేదో కాని, సూర్యుని కాంతికూడ తగ్గిపోయినది!

మూఁడవ యతఁడు:—కలియుగ మండీ! బాగు, కలియుగము!

"........చూచినారా? రాను రాను, విగ్రహ మెంత కళాహీన మగుచున్నదో! పది వత్సరముల క్రిందట దాని చుట్టును తేజోవంత మగు నొక పరిధి వెలుఁగుచుండె డిది...'—అని మఱియొకాయన.

ఇవ్విధమున లోకాభిరామాయణ ప్రసంగములు సాగు చున్న సమయాన, ఒక యింతిని వెంటఁ బెట్టుకొని ఒకఁడు బజారునుండి ఈ గుంపువైపునకు వచ్చుచుండెను. అతఁడు మొలను కత్తియు, చేతను కఱ్ఱయు ధరించియుండె. ఆమొక తలపై నొక మూట యుండెను.

దుస్తుల తీరునుబట్టియు గమనమును బట్టియు, వనిత రాజపుత్ర స్త్రీ యని స్పష్టమగుచుండెను గాని, బాహ్య వేషము పరికించినంతమాత్రాన పురుషుడు ఏ జాతికి చెందిన వదియు గుర్తింప వీలుగాకుండెను.

ఇతఁడాలయముకడ సమూహమును చూచియుఁ జూడ నట్లు తన దారిని తాను పోవుచుండెను. సహజోదారులగు ఊరి వారు అతని నాఁపి, పలుకరించిరి. మౌనముతోఁ గూడిన తల యూపుతో నతఁడు మఱింత వడిగఁ బోఁజొచ్చెను. అప్పటి పెద్దలకు ఇతని యహంకృతి వింతగఁ దోఁచినది. ఆతిథ్య మొసఁగు దమను అభిలాషతో, మున్ను పరిచయములేని ఈ పథికుని నిలిపి, తిరుగ ప్రశ్నింపఁదొడఁగిరి :—

వారు :—ఇల్లెంతదనుక ?

అతఁడు :—చాల దూరము.

వారు :—ఈరాత్రి కిక్కడ బస చేయరాదా ?

అతఁడు :—(అనుమానముతోఁ గూడిన క్రోధముతో) :—ఎందులకీ నిర్బంధము ?

వారు :—మరేమియు లేదు. అసలే కటిక చీఁకటి, అందును, ఆఁడువారితో ప్రయాణము. ఎందు కిబ్బందిపడెదరు ? మీకెట్టి అరమరయు నక్కఱలేదు. మా మాట లాలించి, ఈ రాత్రి మా ఆతిథ్యము కైకొని, ఇట విశ్రమింపుడు.

ఇట్లు దయార్ద్రులగు నా జనులు సోదర వాత్సల్యముతో బహువిధముల నొక్కి నొక్కి చెప్పిరి. గర్వశీలునకు లాలన వాక్యములు చెవి కెక్కునా ? నోరు క్రొవ్వియున్న ఆ పథికుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను :—

"నా సమర్థతయు బలాబలములును తెలిసియే ప్రయాణము చేయుచుంటినయ్యా! ఆలస్యమగునట...ఆలస్యము! నాబోంటి ధైర్యవంతుల కిది యేపాటి?..."

అంత, గుంపులోనుండి యొకరు కోపముతో పల్కిరి :—"పోనిండయ్యా! కొమ్ములు తిరిగిన పోటుగాఁడట!"

రాజపుత్రుఁ డా మాటలను సరకు సేయక, శాంత కాంతితో యథాప్రకారము ముందఱికి సాగిపోయెను.

౨

ఇద్దఱును ఊరు దాఁటిరి. అనంతరము నిర్జనమగు ప్రదేశము. నిశ్శబ్దమగు ఆ కాళరాత్రిలో దిక్కులు గూలిన స్థితి తోఁచెను. అట్టి ఘోరమగు చీఁకటిలో, దురహంకారి యగు రాజపుత్రుఁడు త్రొక్కుకొని దారి తీయుచుండెను; పడఁతి ఆతని వెంట కాళ్ళీడ్చుకొనుచుఁ బోవుచుండెను. కొంత దూర మేగుసరికి జేగంట మ్రోఁతలు వినవచ్చెను. గుడిసెలలో దీపములు మినుకుమినుకు మనుచుండెను. చీఁకటిలో కుక్కలు మొఱుఁగుచుండెను,

హఠాత్తుగ మన పథికులకు గలగలమను శబ్దము వినఁబడినది. గర్వియైన రాజపుత్రుఁడు వెనుదిరిగి చూడలేదు; కాని అదేమి ధ్వనియోయని పడఁతుక ఇట్టె తల త్రిప్పినది. త్రిప్పి ఆశ్చర్యమందుటయే కాక, అత్యంతానంద నిమగ్నయయ్యెను. ఏల?...ఆ వచ్చుచున్నది తన సొంత యూరి తపాలారన్నరు. తలపైని టపాసంచి; శబ్దము చేయుటకై చేతిలో 'రింగు' లున్న ఇనుపకఱ్ఱ; చినిఁగిపోయెడి ఒఱలో దోఁపిన కత్తి యొకటి—ఇది రన్నరు వేషము. ఇతఁడు ఆ

దేశములో 'జతో' యని పిలుతురు. నియమప్రకారము జతో తన ధర్మములు నిర్వర్తించుకొనువాఁడు. ఉత్తరాల కొరకు పోరివారు ఆత్రముతో వేచియుందురని కాదు, ఇట్లు సేయుట. బహా ఆలస్యమైనచో జీతము కోసివేయుదురను భీతి చేతనే అతఁడంత కచ్చితముగ గడియారమువలె పనిచేయును. దాఁటిపోవుచున్న జతోను జూచి రాజపుత్ర స్త్రీ తన తలిదండ్రులను గురించిన కుశలప్రశ్నము లారంభించెను. పుట్టినింటి నుండి వచ్చిన అపరిచితుఁడైనను ఆఁడువారికి సోదరునివలె అగపడును; అందుచేత, మాట పలుకు ఆడుకొనుచు, వారు పయనము సాగించిరి.

ముందునకు సాగిపోవుచున్న రాజపుత్రుఁడు, ఆమె ఎందుచేత వెనుకబడినదో యని అనుమానము తోఁచి వెంటనే వెనుకకు మరలెను—ఏమది! ఆఁడుదియా!! పరాయివానితో ప్రసంగించుటా!!!—ఉగ్రమూర్తియై, సతిని దబదబ బాఁదుచు అసామాన్య వాగ్ధాటితో నోటికి వచ్చిన బొట్లు తిట్టిపోసినాఁడు.

"ఇతఁడు నాకు సోదరతుల్యుఁడు—మా యూరి తపాలా రన్నరు......" అనుచు తడఁబడు మాటలతో నామె చెప్పఁబోయెను.

"ఛీ! నోరు మూయుము, నాకు తెలియును" అని రాజపుత్రుఁడామెను కసరుచు, "ఏమోయి, నీవు ప్రసంగించుచున్న దెవరితోడనో ఒడలు తెలిసి సంచరించుచుంటివా?" అని తపాలావానిని గద్దించెను.

"చిత్తము, చిత్తము!" అనుచు, జతో చల్లగ వెనుకకు జారెను.

3

దుస్సాహసుఁడైన రాజపుత్రుఁడు తన సుందరితోఁగూడ నొక ప్రదేశము చేరెను. అటుపైని రోడ్డు లేదు; సన్నని కాలుదారి మాత్రమే యున్నది. దారి కిరువైపులను దట్టమైన తుండ్లపొద లావరించి యుండినందున, మునుపటివలెఁ జొచ్చి పోవ వీలులేకుండెను. ఇట్టి స్థితిలోఁ గూడ, భయ మన నేమో యెఱుఁగని రాజపుత్రుఁడు కొంతదూరము త్రోసికొనిపోయెను. సగము దారిలోనికి వచ్చునప్పటికి అమాంతముగ పండ్రెండుగురు బందిపోటు దొంగలు ముట్టడించిరి. ఎల్లరు నేకకంఠముతో "కత్తి క్రిందఁబెట్టు" మని రాజపుత్రుని గద్దించిరి. పూర్ణాగ్రహావేశచిత్తుఁడై, రాజపుత్రుఁడు వేతెమియు చేయఁజాలక కొంతసేపు దూషించినాఁడు. దొంగలతని కత్తి లాగికొని, అతనిని విఱిచి కట్టి, దూరమున కీడ్చిరి.

"ఆభరణము లన్నియు నూడఁదీయు" మని నిస్సహాయురాలగు రాజపుత్రి కాజ్ఞాపించిరి. పాప మా యిల్లాలు ఒకటొకటిగ నగలను ఒలువ నారంభించినది.

ఆమెనుగూడ ఎత్తుకొనిపోవుట కా క్రూరులు యత్నించు చుండఁగా, జతో చేయు కలగ శబ్దము వినఁబడి, ఆమె సంతోషమునకు మేర లేకపోయినది "మునిఁగిపోవుచున్న చేతికి తారిపుడక దొరికినను మేలే గద!"

"సోదరా! జతో! రక్షింపుము! కాపాడుము!" అని ఆమె ఒక్క కేక వేసినది.

కత్తిదూసి, కొదమసింగమువలె జతో రంగమున నిలఁబడినాఁడు. దొంగల యత్నములు భగ్నములైనవి.

జతోను వారు కఱ్ఱలతో మోదినప్పటికిని, అతఁడు మంచి సాము చేసినవాఁడు కనుక, ధైర్యముతో వారి దెబ్బల డాకఁ దాఁకి, పోరఁగలిగెను. వారు పెక్కురు, ఇతఁ డొక్కఁడు! అయినను, జతో కొందఱను హతమార్చెను. కఱ్ఱదెబ్బ లింకను తలపైఁ బడుచునేయున్నవి; కాని జతో వానిని సరకుగొన లేదు. అంతట రాజపుత్రి, సహాయముకొఱకు పెద్ద బొబ్బ పెట్టెను. భీతావహులై ప్రాణములు దక్కించుకొనుటకు దొంగల సంపంతయు చెల్లాచెదరుగ పాఱిపోయెను. జతోకు శక్తి యుడిగినది. ఇఁక బాధ భరింపఁజాలక అతఁడు క్రిందఁ బడిపోయెను.

పిమ్మట రాజపుత్రి తన భర్తను విడిపించినది.

అతఁడు :—రమ్ము, పోవుదము.

ఆమె :—ఎచ్చటకు పోవుట? పిఱికిపందా! ఏ మొగము పెట్టుకొని రమ్మనెదవు? ఒక్కనిమిషపు పరిచయమునకే, ఎట్టి సంబంధము లేని ఇతఁడు—నాకొఱకు ప్రాణము లర్పించెనే! నీవు—నా జీవితేశుఁడవగు నీవు, నన్నుపేక్షించి, నీ గొడవ [illegible] చూచుకొంటివి. మాటమాత్రమయిన సాయపడ లేకపోతివే, హంస యెక్కడ, కాకి యెక్కడ? రెండిఁటికిని సామాన్యమా? నీ దారిని నీవు పొమ్ము. నా రక్షకునితో నేనును స్వర్గమునకుఁ బోయెదను.

ఈ వాక్కులు ఆమె హృదయమునుండి ఆవేశబలమున అప్రయత్నముగ వెలువడినవి.

"నీ కంటె అందగత్తెను పెండ్లి యాడెదనులే" అని
నిర్దయాత్ముఁడైన ఆ రాజపుత్రుఁడు నిర్లక్ష్యముగ వదరుచు
ఆమె నా కటికిచీఁకటిలోనే విడిచిపోయెను.

ఆ యువ జంతో శవమును తన యొడి నిడుకొని రాత్రి
యంతయు ఒంటరిగ నచ్చటనే జాగరము చేసెను. ఉదయము
ననే చితి పేర్చి, ముట్టించి, జంతో శవముతోఁ దా నందు
ప్రవేశించెను. సాయంకాలమున కొన్ని బొగ్గులును బుగ్గియు
తప్ప, మరేమియు గానరాలేదు.

* * *

స్త్రీ మాన ప్రాణ సంరక్షణార్థమయి ఏ స్థలమున
తపాలారన్నరు తన యసువుల నర్పించెనో, ఎచ్చోట రాజపుత్రి
కృతజ్ఞతాసూచకముగ ప్రాణముల నాహుతిచేసి పరమధన్య
యయ్యెనో, ఆ పవిత్ర ప్రదేశమున—జంతో జ్ఞాపకార్థమై ఒక
సమాధియు, రాజపుత్రి స్మారకచిహ్నముగ జాతితో చెక్కఁ
బడిన నొక స్త్రీ హస్తమును నెలకొల్పబడి, నేఁటికిని నిలిచి
యున్నవి.

# జగన్నాటకము

[సర్వభూత మయుఁడయిన పరమాత్మ అనునిత్యమును ప్రదర్శించెడి నాటకములోని పాత్రలమే మనము. ఆతని లీల అనంతములు, అందలి ధర్మసూత్రములు దుర్గ్రాహ్యములు. శక్త్యపాధముఁడగు జీవుఁడు తపసి ఇందుకు సంబంధించిన కొన్ని కళ్యంకళ్లను బాపి, పరమేశ్వరుని పరిపాలనా విధానమును, అందులోని అంతరార్థమును ఈ చిత్రకథనములో విప్పి చెప్పుచున్నాఁడు.]

మిక్కిలి భయంకరమగు తుపాను. వాయుదేవుఁడు యావచ్ఛక్తియు వినియోగించి పెద్ద పెద్ద కెరటములను కల్పించుచుండెను. సముద్రుఁడు వెలిగ్రక్కు నురుగుతో సగము సగము మునిఁగియున్న ప్రాతిగుట్టలు స్నానమొనరించుచుండెను. కను చూపుమేరలో నొక యోడ అతివేగముగ పయనము సాగించుచున్నట్లు కానవచ్చినది. పడవ కుండియున్న సామగ్రి యంతయు సముద్రుఁడు పొట్టను బెట్టుకొన్నట్లు తోచెడిని. శిలావశిష్టమై ప్రక్కియున్న ఈ స్వరూపము అలలుప్పొంగినప్పుడెల్ల ప్రక్క యొరఁగుతో పైకిలేచుచు, అవి క్రుంగినప్పుడెల్ల దిబ్బున దిగఁబడుచు, రానురాను తరంగపు దెబ్బల బాధ మిక్కుటమైనందున సహింపఁజాలక ఒక ప్రాతిగుట్టను పగుల్కొని శిథిలమయ్యెను. అచ్చటనే శైల శిఖరమున వసించుచుండిన ముని

యొకఁడు ఈ దుర్భర దృశ్యము వీక్షించి "పరమేశ్వరా! కరుణింపుము, కరుణింపుము!" అనుచు కేక లిడసాగెను. ఈతని యాఱుపులు అరణ్యరోదనము లయ్యెను. ఓడకు ఆయుస్సు చెల్లిన కారణమున అది యొక ప్రక్క కొరఁగి సముద్రమునిలో నైక్యమయ్యెను.

అంతలోనే ఒక నల్లని ఆకారము గుట్టల వైపునుండి సముద్రతీరమునకు వచ్చుచున్నట్లు కనఁబడినది. తొలుత స్వరూపము పోలిక దొరకలేదు. పిమ్మట నురుగు అడ్డముగా నుండుటచే మసకమసకగా కన్పడినది. కెరటములతో కూడ పైకి తేలినపుడు దాని రూపము ప్రస్ఫుటముగ బయల్పడె. మఱల నిట్టె మఱుఁగుపడె. దరికి సమీపింపఁగా—అది ప్రాణములఁ దక్కించుకొన తికమకలు పడుచున్న జనముతో నిండినట్టి ఒక చిన్న పడవ యని స్పష్టపడినది! తొందరగా ఒడ్డునకు వచ్చి, మనస్సంక్షోభితమగు ఆశాభయములతో ముని దాని రాకను గమనించుచుండెను; ఎట్టకేలకు సముద్రుఁడు తీవ్రమైన ఒక్క విసరుతో పడవను ఒడ్డునకు కొట్టివేసినాఁడు. తడిసి ముద్దలయి సగము చచ్చియున్న ఆ నావికులు మెల్లగ ప్రాఁకివచ్చి భూమిపైఁబడినారు.

తపసి వీరలఁ తన గుహకు తోడ్కొనిపోయి ముందు కాచుకొనుటకు అగ్నినమర్చి, పిమ్మట తనకుఁ గలిగినదానితో ఆతిథ్యమొసఁగి వారి మునుపటి బలమును ఉత్సాహమును పునరుజ్జీవింపఁ జేసె.

ముని:—అయితే, మీ ఆర్గురు మాత్రమేనా ప్రాణములు దక్కించుకొనఁగలిగినది?

వారిలో నొకఁడు :—అవును. ఓడలో అబాలగోపాలమును నెబ్బదియైదు మందిమి ఉంటిమి. బాబూ! మునిగిపోవు సమయమున ఏమి ఘోష! ఏమి కలవరము! పతుల మెడలు పట్టుకొని వ్రేలాడు సతులును, తల్లుల చీర చెంగులు పట్టుకొని వ్రేలాడు శిశువులును! రోదనలు—వేదనలు—ప్రార్థనలు—దీనాలాపములు!!! "ఉఁ" అనుట కవకాశ మెక్కడ? కప్తాను ప్రజల గోడవ చూచుచు నేయున్నాఁడు. ఈ చిన్నపడవ చేతికి దొరకఁగా ఆతనితో చెప్పకుండనే త్రాళ్ళు తెంపుకొని చిలుకలో దూఁకినాము. దుముకుటయే తడవుగ ఓడ గంగార్పణమైనది. మేము మాత్రము ఎటులనో బ్రతికి వచ్చి ఇట నిట్లు జీవములతో నున్నారము.

వీరి వచనములకు ముని విషణ్ణుఁడైనాఁడు. "దైవమా! దుష్ట పాపిష్ఠులకు బదులుగ కొందఱు సన్మార్గుల ప్రాణములు రక్షింప లేకపోతివా?" అను తలంపు మనస్సులోఁ జొరకుండ తప్పినది కాదు.

ఈ యవస్థలో నావికులకు వలయునదేదో లభ్యమైనది, "అన్నదాత సుఖీభవ!" అనియైన నోటనుచ్చరింపకయే ఆ కృతఘ్నులు వారి దారి వారు పట్టి, దేశము ప్రవేశించిరి. చీఁకటిపడినది. కొంతదూరమున వెలుఁగు కనఁబడఁగా అక్కడ చేరుకొనిరి. అది యొక తోఁట. అందొక రమ్యమగు భవనము. ఈ ద్రోహులు తలుపు తట్టి ఇంటివారికి తమ యవస్థను వెలిబుచ్చి "ఆదరింపుఁ" డని వేడుకొనిరి. కరుణామయులగు ఆ గృహస్థులు వీరల నుచితరీతిని సత్కరించిరి.

యజమానుఁ డింట లేఁడు. ఇంటియామె, బిడ్డలు, పరి-
చారకులు, ఒక వయోవృద్ధు, కుఱ్ఱఁడును అట నున్నవారు.
నిప్పుకడ చలి కాచుకొనుచుండఁగా నావికులకు ఒక దురా-
లోచన పొడమినది: ఈ యిల్లు కొల్లఁగొట్టినచో శ్రమము
నకుఁ దగిన ఫలముండుననియు అందుల కిదియే మంచి తరుణ-
మనియు. ఒకరితో నొకరు కూడఁబలుకుకొనిన పిమ్మట తమ
పన్నగడ తక్షణమే ఆచరింప కృతనిశ్చయులైరి.

అంతట—ఇంటిలోని వృద్ధు కట్టెలు తెచ్చుటకు వెడ-
లఁగా, అందొకఁడు అతని తలపై చేనున్న ఇనుపకోలతో
నొక్క వ్రేటు వేసి దివి కంపెను. మఱొకఁడు పాఱిపోవ
నుద్యుక్తుఁడై యున్న కుఱ్ఱవానిని తఱిమి తఱిమి కత్తి దూసి
గుండెలో పొడిచినాఁడు. మిగిలినవారు తలుపు లన్నియు
గడియలువైచి స్త్రీలను పిల్లలను పట్టిచికట్టి మాట రాకుండ
నోట గుడ్డలు క్రుక్కి ఇల్లు గాలింప మొదలిడిరి. అందొక
బిడ్డఁడు భయకంపితుఁడై పీలగొంతుతో నఱచుచుండ దొంగ-
లలో నొకఁడు వెళ్ళి పీక నులిమివైచెను. ఒక్కొక్కఁడు
విలువగల సామానులు మోయఁజాలినన్ని మూటఁ గట్టుకొని
ఇల్లు దాటిపోవ సంసిద్ధులుగ నుండిరి.

ఇంతలో యజమానుఁడు ఇల్లు చేరినాఁడు. ఇతఁడు
భూస్వామి. నిషిద్ధ వస్తువులు ఎగుమతి దిగుమతి చేయు
రహస్య వ్యాపారముకూడ సాగించును. నాఁడు సేకరించిన
సామగ్రి ప్రక్కయింటి మిత్రుల యధీనము గావించి ఇదే
యింటికి వచ్చుట.

తలుపులు బిగింపఁబడియుండుటకు విస్మితుఁడై గదు
లలో ఇటునటు వెలుఁగు ఆడుచుండుటఁ గని ఏదియో విప
రీత మున్నదని శంకించినాఁడు; అట్టి ఒక్క నిమిషము నిదా
నింప క్రొత్త గొంతుల గుసగుసలు వినవచ్చినవి; కిటికీ సందుల
గుండా పరికించి చూచినాఁడు. పరాయి మొగము లగపడినవి,
వెంటనే పరువెత్తిపోయి తా నప్పుడే విడిచివచ్చిన మిత్రబృంద
మును వెంటఁ గొనివచ్చినాఁడు. దొంగలు తలుపులు తెఱచు
కొని మాటలతో నొక్కొక్కరుగ నీవలఁ బడఁజొచ్చిరి. వీరు
దొంగతనముతోను హత్యలతోను ఊరకుండిరా! దుష్కృత్య
ములు కప్పిపుచ్చుటకై కొంపకు చిచ్చుకూడ తగిలించిరి.

ఇంటి యజమానుఁడు తన జట్టుసాయముతో వారి
నందఱను పట్టుకొనినాఁడు. ఇంటిలోని అగ్నిజ్వాలఁ జల్లార్చఁ
బనిచినాఁడు. మఱునాఁడు లోకు లెల్లరును 'ఛీ! ఛీ!' యనఁ
చుండ దుష్టనావికులు 'జైలు' నలంకరించినారు.

ఈ యుదంతము మన ముని చెవులఁ బడఁగా—
'ఓహో! దైవ సంకల్ప మెంత చిత్రము! దుష్టశిక్షణము
నకును శిష్టరక్షణమునకును కంకణము కట్టుకొనియున్నాఁడు
పరమేశ్వరుఁడు!' అనుకొనుచు ఆశ్చర్యపడి ఒకింతసేపుండి ఇటు
లాలోచింపఁగడంగెను: ఈ దుర్మార్గు లిట్టి దుష్టచేష్టలు చేయఁ
కుండ సముద్రములోనే మునిఁగి చచ్చియుండరాదా! వీరికి
బదులు ఓడలోని కొందరు సన్మార్గులు బ్రతికియుండకూడదా!
అటులైన ఇచ్చట మూఁడు అమాయికపు ప్రాణులు దక్కి
యుండెడివే! ఆ సంగతి యటుంచి—యజమానుఁడు శాసన
విరుద్ధమైన వ్యాపారము తెగించి సాగించుట ఇట మంచిగనే

ప్రారంభించినది. అతఁ డింటియొద్దనే ఉన్నచో తన కుటుంబ ముతో పాటు సాతుఁడై యుండును; దుర్మార్గులకు స్వేచ్ఛయు నవకాశమును ఎక్కుడుగ నుండెడిది. ఇదంతయుఁ జూడ దైవ సర్గ దోషముల నేనునుకొనుటకును వలను గాకున్నది!'—ఇట్టి సంశయకలితమగు ధ్యానములో మునిఁగి చింతాక్రాంతుఁడై, అలసి అట్టె తల వ్రాల్చి కను మూసినాఁడు. నిద్దుర ముంచు కొని వచ్చినది, ఆ నిద్దురలో నతఁ డిట్లొక కల గాంచినాఁడు:

తాను శైలశిఖరమున ఆసీనుఁడై యుండెను: తెల్లని వస్త్రము ధరించిన ఒక దివ్యసుందర విగ్రహుఁ డీయనకు సందర్శన మిచ్చి 'ఏమయ్యా! నీ వదన మటులున్న దేమి? కించనా! హేతు వెయ్యది?' అని పలుకరించెను.

ముని:—మహానుభావా! నీతి విజ్ఞానముల గుఱించిన నా భావములు భగవదాజ్ఞలతో సమన్వయించుకొన లేకున్నాను. ఇదియే నా సంతాప కారణము.

అతఁడు:—సృష్టివిధానములఁ గూర్చిన నీ యూహలు సంకుచితములై యున్నందున నీవు పొరఁబడుచున్నావు. పరమే శ్వరుని పరిపాలనము నంతను సమగ్రముగ పరిశీలింపఁ జాలక నీ దృష్టి ప్రత్యేకాంశములపైని మాత్రము ప్రసరించినందుననే ఈ చిక్కు. ప్రపంచ సంభవము లన్నియు దైవనిర్ణీతము లే. జగన్నాటక సూత్రధారుఁడు అఖండ విజ్ఞాన భూయిష్ఠమగు తన సంకల్పములచే ప్రాణికోటి కంతకును మేలు చేకూర్చును. స్వల్పసంభవముల పాటించి వ్యక్తిగతముగ విషయములు విమ ర్శింపఁ బూనితిమేని అది తప్పక భ్రమ ప్రమాదములకు దారి తీయును—నాతో ఈ శిఖరాగ్రమునకు రమ్ము.

ముని అతని వెంట ఎత్తయిన ఆ గిరిశిఖరమునకుఁ బోయెను.

అతడు:—క్రిందికి జూచి నీ కే మగపడుచున్నదో చెప్పుము.

ముని:—ఒక డేగ చిన్న పక్షుల సమూహమును వెంటాడుచున్నది. అందొకటి దానికిఁ జిక్కినది. తక్కినవి పాఱిపోయినవి.

అతడు:—ఒక్క సంగతి ఆలోచించుకొనుము. ఇప్పుడా పట్టువడిన పిట్టమీఁద భగవంతునికి కోపమును పాఱిపోయినవానిపై దయయు ననుకొంటివా!—అటులు కాజాలదు. బ్రతికియున్న చిన్నజీవులను ఆహారము గొనుట డేగలకు సహజస్వభావము. అందుల కనువగు బలమును, త్వరిత గమనమును ప్రసాదింపఁబడి యుండుటచే అవి పిట్టలను సుకరముగ వేటాడగలవు. ఇవ్విధమున ప్రాణులను పోషించుటకే ప్రాణము లర్పింపఁబడుచున్నవి. కాని ఈ లయమునకుఁ గూడ కొన్ని హద్దు లేర్పడియున్నవి. వేటాడు పక్షులకంటె చిన్న పిట్ట లసంఖ్యాకములు. వాని శక్తి నివి ఎదిరింపఁజాలక పోయినను శత్రుబారినుండి తప్పించుకొను సామర్థ్యమును, లాఘవముతో నెగురు శక్తియుఁ గలిగియున్నవి. ఇట్టి సమదృష్టిలోనే పరమేశ్వరుని విజ్ఞానము లగ్నమై యున్నది. ఇంతకంటెను విచిత్రము-సహజ పరస్పర వైరులగు ఈ రెండు జాతులును ఒకేచోట నివసించుట!

సరే, మరల అటు చూచి నీ కేమి గోచరించునో తెల్పుము.

ఈ మహాభూతమువలననేకదా కోటానకోట్లు జన్మించుట! కొలఁది ప్రాణులు సమయుచో అదొక లెక్కయా! భూములు సారవంతమగుటకై కొండలనుండి మహానదులు ప్రవహించు నపుడు మానవనిర్మితములగు కొన్ని కట్టడములు భగ్నమగును, అప్పట్టున మనుజులే విధ్వంసము కావచ్చును. పోనీ, ఈ నష్టము లేకుండ మనము ఇట్టి లాభములు పొందఁగల వేఱు సాధన మేదైన నున్నదా?

ముని :— మహాశయా! తమ ప్రబోధమును గ్రహించితిని. కాని, నిన్నను జరిగిన విషాద వృత్తాంతములఁగూర్చి యేమనెదరు? ఒక మనుజుని మఱియొకని బాధకు గుఱిచేయు నేల? దుష్టుల క్షేమమునకై శిష్టులఁ జంపనేల? వీనివలనఁ గలుగు లాభమేమి?

అతఁడు :— ఇదికూడ ఆ జ్ఞానమయుని విచిత్రపరిపాలనా ఫలితమే. మానవుని అభ్యాసశీలునిగ పరిగణించుటయే సమంజసమైనచో నావికులకంటె "కప్తాను" కే ప్రాణసంరక్షణ మొనరించుకొను నవకాశము మెండు. కాని తన ప్రాణముల కొఱకతఁడు పెనఁగులాడలేదు. ఎందుచేత? "స్వార్థము" అను అలవాటునకు కొన్ని నియమము లేర్పఱచుకొన్నందున, దాననే ధీరుఁడైనాఁడు. ఇఁక నావికులన్ననో, అట్టి నియమములు లేని కారణముననే దొంగిలుగను హంతకులుగను మాఱినారు. మానవుని స్వార్థపరత్వమువలన కలుగుచుండు కీడును అటంకపఱచుట దుష్కరము; కాని, ఇట్టి బాధలు నివారించుటకే చట్టములు వినియోగింపఁబడుచుండును. ఎప్పటి

కైనను "ధర్మము గొడుగు, అధర్మము పిడుగు"—ఇది శిలాక్షరము.

నాయనా! ఇచ్చట కాకపోయిన మఱొక లోకమున నైన దైవము పాపులకు తగిన ప్రాయశ్చిత్తము చేయకుండ వదలునని తలఁపకుము.

వ్యక్తిగతమగు సంశయములు నీ మనస్సున చొరనీయకుము; విషయములు సంపూర్ణముగ పరిశీలించినప్పుడు మొత్తముమీఁద నవి ఎల్లర మేలుకోసము ఏర్పడియుండునని నమ్ముము. భగవంతుఁడు ప్రత్యేక విషయములలో జోక్యము కలుగఁజేసికొనలేదే యని చింతింపకుము; సమయానుకూలముగ నీవు దానిని గ్రహింపఁగలుగుదువు. ఒక ఈఁగ చనిపోవునేమో యను భీతిచే కాలచక్రము నాఁపివేయఁదగునా? ఎన్నియో ప్రాణులు ప్రతిక్షణము నాశనమగుచున్నను పాటింపక పరమేశ్వరుని ధర్మపరిపాలనములో తోడ్పడుటకై కాలచక్రము తిరుగుచునేయుండును. మున్ముందుకూడ జరుగఁ దలఁచిన క్రమము ఇదియే!

---

# దైవబలము : మానవబలము

[దైవబలము మానవబలము—ఏది శక్తివంతమయినది.- ఇది యొక వినోద సమస్య; విజ్ఞానపూరితమైనది కూడను. 'నమ్మి కొల్చిన వారికి చెఱుపు లేద'నుట పేద బ్రాహ్మణుని కుటుంబమునకు స్వానుభవమైనది. మఱియు, భక్తులకు భగవంతు డెవ్విధమున సాయపడునో తెలిసివచ్చినది, పేరాస ఎన్నటికి పనికిరాదనియు, మానవ బలముకంటె దైవబలమే మహత్తర మయిన దనియు, సాహుకారు గ్రహించినాఁడు. ఈ పరమ సత్యములను పట్టి చూపుచున్నది ఈ మహారాష్ట్రీ జాతీయ గాథ.]

నిన్నకాదు మొన్నకాదు, కొన్నివేల వత్సరముల క్రిందటిమాట; నిశా సమయమున పార్వతీ పరమేశ్వరులు విమానయానము సల్పి, శరణార్థుల సముచితరీతిని బహూకరింపుచుండెడి యప్పటి గాథ. ఇప్పటి యంత దుష్కాలము కాదది. ఇంత బహుళముగ పాపిష్ఠులు కానరారు, సజ్జనులు పెక్కుఁరు, ఇక్కట్టుల ననుభ వించుచున్న కొలదిమందియైనను కోరినంతమాత్రమున దైవ కృపకు పాత్రులగుచుండిరి. అట్టి కాలములో—

ఒక యూర నొక బ్రాహ్మణుఁడు కలఁడు. అంధుఁడు. గాఢముగు ఈశ్వరభక్తుఁడు. శాంతియుతుఁడు. కడు బీదయైనను కలిగినదానితో తృప్తిచెందువాఁడు. సతీమణి గాక మువ్వురు పుత్రులు ఒక పుత్రికయు గల కుటుంబమును అతఁడు భరింప వలసి యుండెను. ఊరి చివర నున్న ఆలయములో యాచనా

వృత్తిచే ఈ పెద్ద సంసారమును కష్టముతో పోషించుచుండెను. అతని భార్య ఉత్తమురాలు. భర్త గ్రుడ్డివాఁడైనను పేద స్థితిలో నున్నను నిరసింపక అతనిఁ బ్రేమించి ఎల్లవిధముల తోడునీడయై యుండెను. ప్రత్యూదయమునను ఆమె భర్తను దేవాలయములో దిగఁబెట్టును. అచ్చట బ్రాహ్మణుఁడు పఱచిన చింకిదుప్పటిమీఁద యాత్రికులు తమకు తోచిన—బియ్యమో, పండ్లో, రొక్కమో—వేసి పోవుచుందురు. ఆమె సాయంకాలము వచ్చి అతని నింటికిఁ గొంపోవును. ఆమెకు వీలుపడని వేళలందు పిల్లలను పంపుచుండును.

వీరి దారిద్ర్యమునకు తోడు సకాలమునకు అద్దె చెల్లింపలేనపుడెల్ల ఇంటి యజమానుని బెదరింపులు నిర్దయాత్మకమగు దూషణములు తప్పకుండెను. ఆ గృహమేధి చండశాసనుఁడగు ఒక వణిగ్విభానుఁడు!

భార్యాభర్తలు రాత్రులందు తమ దురవస్థలను పరస్పరము వెలిబుచ్చుకొనుచుందురు. ఒకప్పుడు బ్రాహ్మణుఁడామెను ఇటు లోదార్పఁ జొచ్చెను: "కుఱ్ఱవాండ్రకు ఉపనయన మయినతోడనే మన కష్టములు గట్టెక్కును. అప్పుడు వారు భిక్షమెత్తుకొన నర్హులయి సంపాదనమునకుఁ గడంగ వచ్చును. అదియుఁగాక పిల్లకు పెండ్లి అయినచో, ఆమె బాధ్యతకూడ మనకు వదలును" ఈ వచనముల కామె సంతసించినది. చీఁకటిరాత్రుల తర్వాత వెన్నెలరాత్రులు రాక పోవునా యని ఉభయులు దైవమునే నమ్మియుండిరి.

ఇట్లుండ నొక దినమున—దీపాలవేళయైనను బ్రాహ్మణు నింటికిఁ జేర్చుట కెవ్వరును రారైరి. అతనికి ఆత్రము

హెచ్చెను. కొంతసేపటికి తన సతి వచ్చినది, కాని వెక్కి వెక్కి యేడ్చుచుండెను. కారణ మేమన? ఇంటి యజమానుఁడు పంపిన "అపరనక్షత్రకుఁ"డగు సేవకుఁడు బ్రాహ్మణుని భార్యను పిల్లలను పలువిధముల బాధించెను. వారి కుండియున్న కొలఁది పరికరములను, పప్పు బియ్యము మొదలగు తినుబండములను, వీధిలో విరజిమ్మి విసరివైచెను. అద్దె చెల్లింపనిచో ఒక్క నిమిషమైనను పంచక్రింద నుండవలదని శాసించెను. బ్రాహ్మణుఁడు కథయంతయు వినినాఁడు. చేయుట కేమున్నది? ఆమెతో కూడ అతఁడును దుఃఖింప నారంభించెను.

ఈ సమయమున పార్వతీ పరమేశ్వరులు ఆకాశ మార్గమునఁ బోవుచుండిరి. పేద దంపతుల దుర్భర పరితాపమును గాంచి పార్వతి "నాథా! అంధుఁడగు మీ భక్తుఁడు నిస్సహాయుఁడై ఎట్లు దుఃఖించుచున్నాఁడో చూడుఁడు. దయ లేదా? నా విన్నప మాలించి అతనిని బాధావిముక్తుని జేయుఁడు. వారి రోదనము వినఁజాలకున్నాను. రేపటికి అతఁడొక లక్షాధికారి యగునట్లు అనుగ్రహింపవలెను."

పరమేశ్వరుఁడు :—ప్రియా! అతఁడు తాఁ జేసికొనిన కర్మము ననుభవించుచున్నాఁడు. కలిమిలేములు కావడి కుండలు. త్వరలోనే అతనికి అదృష్టదినములు బయల్పడఁగలవు.

పార్వతి :—ఆ యదృష్ట మిప్పుడే ప్రసాదింపుడు.

పరమేశ్వరుఁడు :—సరే, నీ యభీష్టము నెఱవేఱును!

ఇట్టి సందర్భములో ఇంటి యజమాని యగు వణిక్ప్రముఖుఁడు దేవదర్శనముసకై ఆలయమున కేతెంచి, పూజారికొరకు నిరీక్షించుచుండెను. అంత, గుడిలోని విగ్రహా

ములీ తీరున మాటాడుకొనినట్లు లోపలనుండి వినవచ్చినది :

"నాయనా, గణేశా!"

"ఏమి తండ్రీ!"

"మన ఆలయమునకు అనుదినమును వచ్చుచున్న అంధబ్రాహ్మణునికి రేపు సాయంకాలము లోపల ఒక లక్ష రూపాయ లిమ్ము, ఏమి?"

"అటులే తప్పక."

ఈ ప్రసంగ మంతయు స్పష్టముగ ప్రతి అక్షరము షాహుకారు చెవులలో ప్రతిధ్వనించెను. అందుచే గణపతి పరమేశ్వరుల సంభాషణము అతనికి మిక్కిలి సమ్మకము పుట్టించెను.

అతఁడు దైవప్రార్థన త్వరితముగ ముగించి ఇంటికి మరలి, అర్ధరాత్రమున బ్రాహ్మణునికడకు పోయి ఇటులనెను:– "బాబాజీ! నా సేవకుఁడు మిమ్ము తూలనాడి ఇబ్బంది చేసె నఁట; ఎంత పని! ఇందుకు నే నెంతో పరితపించుచున్నాను. ప్రపంచములో నిట్టి పశుప్రాయులు కొందఱుందురు. అది నా తప్పుగా భావించి క్షమింపవేడెదను. తమవంటి ఉత్తమ బ్రాహ్మణులకు పాపము, అంధత్వముకూడ సంప్రాప్తమైనది. తమ ఈ దురవస్థకు మనస్సులో నే నెంత ఖేదపడుచున్నానో దేవునకే ఎఱుక; అద్దె విషయమై తమ రావంతయు చింతింప వలదు. మీ చిత్తము వచ్చినంతకాల ముండుఁడు. బ్రాహ్మణ సత్కారము దైవపూజయే కదా! ఇదిగో, ఈ పదిరూకలును దయతో స్వీకరించి ఆశీర్వదింపుఁడు. కాని ఒక చిన్నవిన్నపము: ఇటు లన్నందుకు మఱొకవిధముగ భావింపరనియే నమ్మిక.

రేపటి దినమున ఉదయము నుండి సాయంత్రము వఱకు ఆలయములోని తమ సంపాద్యము మాత్రము నాకు ప్రసాదింపవలెను."

ఈ ప్రార్థనకు ముసలిబ్రాహ్మణుఁ డించుక విస్మయమందినాఁడు. గర్భదరిద్రుఁడై నందున పదిరూపాయలును మహాభాగ్య మనిపించినది కాని ఆలోచించి, మఱునాటి తన యాచనాభాగ్యము విక్రయించుట కియ్యకొనలేదు.

సాహుకారు :—కాదు బాబాజీ! తొందరపడకుము. అంతగా వలయునేని నూఱురూపాయలు గైకొనుము. రేపటి నీ ఆర్జనమాత్రమే నే కోరునది.

బ్రాహ్మణుఁ డీ బేరమున కిష్టపడలేదు, వర్తకుఁడు అతనిని వదలుటలేదు. క్రమముగా పాట రు. 75000 ల వఱకు పెరిఁగినది. అప్పటికిని బ్రాహ్మణుఁడు ఒప్పుకొనలేదు. కాని ఈ సంభాషణ మాలకించుచున్న బ్రాహ్మణుని భార్య యింతలో వచ్చి యిట్టు లనెను :—"అయ్యా రు. 75000 లును తీసికొని రండు. నా భర్తగారిచే యెట్టులయిన ఒప్పించెదను." ఆమె ప్రోద్బలముచే కడకు బ్రాహ్మణుఁ డంగీకరించెను. తత్క్షణమే సాహుకారు లోనికి బోయి రు. 75000 లును సంచులతో కొనివచ్చి బ్రాహ్మణుని స్వాధీనము చేసినాఁడు. ఇంకను రు. 25000 లు లాభమున్నది గదా యని అపరిమితోత్సాహముతో నతఁడు కలుకుచుండెను.

ఉదయమైనది. మామూలు ప్రకారము బ్రాహ్మణుఁడాలయములో పద్మాసనము వైచుకొని తువ్వాలుగుడ్డ ముందఱపఱచుకొని కూర్చుండెను. సాహుకారు ఇతనిని కను

పెట్టి చూచుచునేయుండె. మధ్యాహ్నమైనది. కొన్ని దమ్మిడీ
కాసులు బియ్యము రకరకముల కూరలు—ఇవియే యాచనా
వస్త్రముపై కానఁబడుచున్న ఆస్తి. ఆత్రముతో వర్తకుఁడు
నిరీక్షించుచుండెను. ఇంకను ఒకపూట యున్నదిగదా! ఏమి
భాగ్యము రానున్నదో యని తలపోయుచుండెను. దేవుని
వాగ్దత్తము చెవులార స్పష్టముగ వింటినే, అది వ్యర్థమగునా?
అని తనలో తాను వితర్కించుకొనుచుండెను. సాయంకాల
మగునప్పటికిఁ కూడ తన యాశ నెఱవేఱునట్లు తోఁచలేదు.
ఓరిమి తగ్గుచుండెను. అవసరమైనచో సాయంకాలమైన తరు
వాత కూడ మరి కొంతసేపు ఉండవలసివచ్చునని బ్రాహ్మణు
నితో నొక్కి చెప్పఁగా అతఁడందులకు సమ్మతించెను. గంట
సేపైనది, మఱియొక గంట, మఱియొక గంట గడచినది. ఏ
విధమగు రాబడియు కానరాలేదు. చీఁకటి పడినది. సాహుకారు
రోషపూరితుఁడై గబగబ గణపతి విగ్రహమునొద్దకుఁ బోయి
తుండము పట్టుకొని బెదరించుచు, "బ్రాహ్మణునికి వాగ్దానము
చేసిన లక్ష రూపాయలేవి? అతఁడెంత బాధపడుచున్నాఁడో
తెలియునా? నీవు దేవుఁడవే అయినచో మాట చెల్లించుకొన
వలదా? ఏమి? వినఁబడుటలేదా?" అనుచు తుండము లాగఁ
బోయెను. అప్పుడతఁడాశ్చర్యపడునట్లు తన చేయి గణపతి
తొండములో యిరుకుకొనిపోయెను. అతఁడు పట్టు వదలించు
కొనుటకై లాగి విదిలించి అనేకవిధముల ప్రయత్నించెను.
కాని ఇసుమంతయు లాభము లేకపోయెను. మనస్సున కొక
విధమగు జంకు కలిగినది. "మహాప్రభూ! వేయి కొబ్బరి
కాయ లభిషేకము చేసెదను, చెయ్యి వదలుము, దేవుఁడా!"

అని బహుభంగుల మ్రొక్కెను. స్థితి మాఱలేదు. అంతట మునుపటి విధమున విగ్రహము లిటులు సంభాషించుకొనుట వినవచ్చెను :

పరమేశ్వరుఁడు :—బ్రాహ్మణునకు లక్ష రూపాయిలును ఇచ్చితివా ?

గణపతి :—చిత్తము నాయనగారూ! నిన్నటి రాత్రి డెబ్బదియైదు వేల రూపాయలిచ్చితిని. మిగిలిన సొమ్ము ఇచ్చు ప్రయత్నములో నున్నాను. తక్కిన ఇరువదియైదు వేలును సాహుకారు ఆ బ్రాహ్మణు నింటికి పంపిననే వదలెదను, లేకున్న పట్టు విడువను.

తనకు సంభవించిన దుర్భరస్థితిఁ గాంచి వర్తకుఁడు తక్షణమే రూ. 25000 లును బ్రాహ్మణునకు చేరు యేర్పాటు గావించెను. ఈ పని జరిగినదే తడవుగ నతని చేయి ఊడి వచ్చినది. చేయునది లేక హతాశుఁడై విచారముతో నతఁడింటికి మరలెను.

* * *

స్వహస్తములతో దేవుఁ డెవ్వనికి ధనము ప్రసాదింపఁడు. ఒకరిచే మఱియొకరి కిప్పించును. ఆ యిచ్చుటలోకూడ సగము సగము కాకుండ పూర్తిగా తన వాగ్దానము నెఱవేర్చును. పార్వతీ పరమేశ్వరు లా బ్రాహ్మణునకును కుటుంబమునకును సకల సంపద లొసంగుటయే గాక అతనికి దృష్టికూడ ననుగ్రహించిరి. అంతటినుండి వారెల్లరును భక్తియుతులై సుఖముగ జీవయాత్ర గడుపసాగిరి.

# తూలిక

ఇందలి కథలకు ఆధారములగు మాతృకలు ఇట కృతజ్ఞతాపూర్వకముగ పేర్కొనంబడుచున్నవి:—

టాల్స్టాయి (1,4)
శ్రీ ఎస్. ఎం. పాషా (2,5)
విజ్ఞాన తరంగిణి (3)
జూవెనిల్ బడ్జెటు (6)
శ్రీ జి. కృష్ణరావు (7)

ముద్రణ: కమర్షియల్ సిండికేట్ ప్రింటర్సు, మదరాసు-7.